# మీ అభిమాన పత్రిక



చందమామ (తెలుగు, ఇంగ్లీష్, హిందీ, ఒరియా)ను, జూనియర్ చందమామను మీరిప్పుడు విశాఖపట్నం ప్రాంతంలోని క్రింది ప్రధాన తపాలాకార్యాలయాలలో కొనుక్కోవచ్చు.

ఈ హెడ్ పోస్టాఫీసులు చందాలను కూడా స్వీకరిస్తాయి.

## హెడ్ పోస్టాఫీసుల జాబితా:

| | | |
|---|---|---|
| ఆముదాలవలస | మండపేట | సామర్లకోట |
| అమలాపురం | నర్సీపట్నం | శ్రీకాకుళం |
| అనకాపల్లి | పార్వతీపురం | టెక్కలి |
| బొబ్బిలి | రాజమండ్రి | విశాఖపట్నం |
| చోడవరం | రామచంద్రాపురం | విజయనగరం |
| కాకినాడ | రాజోలు | వాల్తేర్ |



పోస్టాఫీసులలో వివరాలు లభిస్తాయి. చందమామ మీ ఇంటి వద్దకు వచ్చే ఈ అవకాశాన్ని వినియోగించుకోండి.




సంవత్సర చందాలు :
ఇంగ్లీష్ రూ. 180లు;
ఇతర భాషలు రూ. 150లు;
జూనియర్ చందమామ రూ. 150లు.

విడిప్రతి :
ఇంగ్లీష్ : రూ. 15లు; తెలుగు, హిందీ, ఒరియా రూ. 13లు;
జూనియర్ చందమామ : రూ. 15లు.






# చందమామకు సత్కారం!

మరో ఆరు నెలలలో మీ అభిమాన పత్రిక చందమామ అరవైయవ జన్మదినోత్సవం జరుపుకోనున్న విషయం మనకందరికీ తెలిసినదే. యువతరం పాఠకులకూ, బాలసాహిత్యాభివృద్ధికీ చందమామ చేస్తూన్న సేవలను గుర్తించి, ఇటీవల తిరుపతి తెలుగు సంస్కృతి వికాస వేదిక, గుంటూరు శ్రీ వేంకటేశ్వర బాల కుటీర్ చందమామ సంపాదకుణ్ణి సత్కరించాయి. పత్రిక ప్రచురణకర్తగా, సంపాదకుడిగా ఆయన చేస్తూన్న కృషిని ప్రత్యేకంగా ప్రశంసిస్తూ అభినందించాయి. ఆ సత్కారాలను సంపాదకులు వ్యవస్థాపకులకు సవినయంగా అంకితమిచ్చారు.

అరవై వసంతాలు నింపుకుంటూన్న పిల్లల పత్రిక చందమామను సత్కరించినందుకు ఈ రెండు సంస్థలకూ, ముఖ్యంగా తెలుగు సంస్కృతి వికాస వేదిక అధ్యక్షులు శ్రీ భూమన కరుణాకర రెడ్డి గారికీ, శ్రీ వేంకటేశ్వర బాల కుటీర్ సంస్థాపకులు డా. మంగాదేవిగారికీ హృదయ పూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాం. చందమామ పాఠకులకూ, అభిమానులకూ, శ్రేయోభిలాషులకూ లభించిన సత్కారంగానే దీనిని భావిస్తున్నాం.

అరవై సంవత్సరాలుగా చందమామ బాలసాహిత్యానికి చేస్తూన్న సేవలను కొనియాడుతూ ఇటీవల వ్యాసాలను ప్రచురించిన వార్తాపత్రికలకూ, ప్రత్యేక కార్యక్రమాలను ప్రసారం చేసిన టీవీ ఛానళ్ళకూ కృతజ్ఞతలు తెలియజేస్తున్నాం.

పాఠకులు ఇన్ని సంవత్సరాలుగా అందిస్తూన్న ఆదరాభిమానాలకు కృతజ్ఞతలు తెలియ జేస్తున్నాం. ఇప్పటిలాగే మునుముందు కూడా పాఠకుల ఆదరాభిమానాలను చూరగొనగల దని చందమామ విశ్వసిస్తూ, అందరికీ నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలియజేస్తున్నది.

– ప్రచురణకర్త






చందమామ సంపుటి: 60 జనవరి 2007 సంచిక: 1

## ఈ నెల విశేషాలు

















## ఈ సంచికలో ...




**SUBSCRIPTION**

For USA and Canada
Single copy $2
Annual subscription $20

*Remittances in favour of Chandmama India Ltd.*
to
Subscription Division
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal,
Chennai - 600 097
E-mail :
subscription@chandamama.org




## చందమామ క్విజ్ - 10 (నవంబర్ '06)
### విజేతలకు అభినందనలు

1. ఎం. రాజ్యలక్ష్మి, జగ్గయ్యపేట - 521 175 (ఆం.ప్ర)
2. బి.వి. నర్సింహారావు, విశాఖపట్నం - 530 020 (ఆం.ప్ర)
3. సుర్తా లింగరాజు, మక్కువ, విజయనగరం జిల్లా - 535 547 (ఆం.ప్ర)
4. ఎం.కె. చంద్రహాసన్, యాప్రాల్, రంగారెడ్డి జిల్లా - 500 087 (ఆం.ప్ర)
5. కెళ్ళ ధనుష్‌రాజా, ఏలూరు - 534 002 (ఆం.ప్ర)





వ్యవస్థాపకులు
బి. నాగిరెడ్డి - చక్రపాణి

# ధరిత్రీ వత్సరం: మనవంతు కర్తవ్యం

**2007** చందమామకూ, లక్షలాది మంది చందమామ పాఠకులకూ ప్రత్యేక ప్రాముఖ్యతను సంతరించుకున్న సంవత్సరం. ఎందుకంటే, ఈ సంవత్సరంతో చందమామ అరవై వసంతాలను పూర్తి చేసుకుంటున్నది. మన దేశం స్వాతంత్ర్యం సాధించి అరవై సంవత్స రాలు నిండడంతో ప్రతి భారతీయుడికీ ఆనందోత్సాహాలు కలిగించే సంవత్సరం కూడా ఇది కావడం సంబరం కలిగించే మరో విశేషం!

అంతర్జాతీయ ధరిత్రీ వత్సరం (2008) కార్యకలాపాలు 2007లోనే ప్రారంభమై 2009 వరకు కొనసాగుతాయి. అందువల్ల భూమి పర్యావరణ పరిరక్షణ పట్ల శ్రద్ధాసక్తులు కలవారందరికీ 2007 ఎంతో ప్రాముఖ్యతను సంతరించుకున్న సంవత్సరం!

ఈ అంతర్జాతీయ వత్సర లక్ష్యాలను సాధించడానికి ఐక్యరాజ్య సమితి కొన్ని నిర్దిష్ట లక్ష్యాలను నిర్దేశించింది. అవి ఇవి: జీవన పరిణామ అవగాహనను మెరుగు పరుచు కోవడం; భూ విజ్ఞాన శాస్త్ర వివిధ వైద్య పార్శ్వాల విస్తృత పరిజ్ఞానంతో మానవ ఆరోగ్య అవరోధాలను తొలగించడం; భూ విజ్ఞానం పట్ల సమాజంలో అవగాహనను పెంపొందిం చడం; నూతన ప్రకృతి వనరులను అన్వేషించడం; జలవనరులను కనుగొనడం.

ఈ ప్రతి ఒక్క లక్ష్యసాధనలోనూ మనలో ఒక్కొక్కరూ నిర్వర్తించవలసిన కర్తవ్యం ఎంతో కొంత ఉన్నది. వాతావరణ కాలుష్యాన్ని అరికట్టి, పర్యావరణ సమతౌల్యాన్ని పరిరక్షించ డానికి మనవంతు కర్తవ్యాన్ని నిర్వహిద్దాం. దీనినే నూతన సంవత్సర సంకల్పంగా స్వీకరిద్దాం!

సంపాదకుడు : విశ్వం

Visit us at : http://ww.chandamama.org

# పాఠకుల లేఖలు

నేస్తం చందమామకు నూతన సంవత్సర (2007) శుభాకాంక్షలు. పాఠకుల లేఖలు ప్రవేశ పెట్టడం ద్వారా, పాఠకుల అభిప్రాయాలు, విమర్శలు, సూచనలు తెలుసుకోవడానికి వీలవుతుంది. నాకు ఊహతెలిసినప్పటి నుంచి చందమామను చదువుతున్నాను. ప్రస్తుతం పాఠశాల ఉపాధ్యాయుడిగా పనిచేస్తున్నాను. పిల్లలకు కథలంటే ఇష్టం కదా! చందమామను చదివి అందులోని కథలను విద్యార్థులకు చెబుతూంటాను. కాలం కంప్యూటర్ యుగాలను దాటి ముందుకు వెళ్ళినా, చందమామ ప్రస్థానం ఎలాంటి ఒడిదుడుకులు లేకుండా ముందుకు సాగాలని కాంక్షిస్తున్నాను. – జానపాటి శ్రీనివాస్, మిర్యాలగూడా, నల్లగొండ జిల్లా (ఆం.ప్ర)

అమృతతుల్యమైన వాక్యాలను పొందుపరచి, సామాన్యుణ్ణి మాన్యుడిగా, అసమానుడిగా మార్చే అద్భుత నీతి కథల పత్రిక చందమామ. మా నాన్న నాకు ఇచ్చిన అమూల్యమైన కానుక చందమామ. భావి భారతపౌరులు తప్పక చదవవలసిన పత్రిక చందమామ. దానిని ప్రారంభించిన శ్రీ బి. నాగిరెడ్డి–చక్రపాణిగార్లు చిరంజీవులు. చందమామ యాజమాన్యానికి నూతన సంవత్సర శుభాకాంక్షలతో,

– ఎల్. రేణుకేశ్వరరావు, సన్నాఫ్ భగవతిరావు, జట్నీ (ఒరిస్సా)

నేను 1951 నుంచి చందమామ పాఠకుణ్ణి. 1998లో కొద్దికాలం ఆగి పోయినప్పుడు ఆప్తుణ్ణి కోల్పోయినట్లనిపించింది. కాని తొందర్లోనే మార్కెట్లో కొచ్చి మమ్మల్ని ఆనందపరిచింది. ఇప్పుడు పిల్లల కథలు, బొమ్మలతో మరింత ముచ్చట గొలుపుతోంది. పాత సీరియల్ 'తోకచుక్క'ను మళ్ళీ ప్రచురిస్తే బావుంటుంది. చందమామ మరింత అభివృద్ధిలోకి రావాలని ఆశిస్తూ,

– కొంపెల్ల సూర్యనారాయణ, హైదరాబాద్ (ఆం.ప్ర)



# న్యాయాధికారి చాతుర్యం

రామవరం గ్రామంలోని కూర్మయ్య ఒంటెద్దు బండి మీద కూరగాయల వ్యాపారం చేస్తూ కుటుంబాన్ని పోషిస్తుండేవాడు. సాయంకాలానికి కూరగాయలు మిగిలితే, వాటిని కాస్త తక్కువ ధరకు అమ్మటం, లేదా తన ఎద్దుకు మేతగా వేయటం కూర్మయ్య అలవాటు. అందువల్ల అతడి వద్ద కూరగాయలు తాజాగా ఉంటాయని పేరువచ్చింది.

ఒకనాడు తన ఆరోగ్యం బాగుండక పోవడంతో, కూర్మయ్య కూతురు పూర్ణమ్మను తోడు తీసుకుని బయలుదేరాడు. మధ్యాన్నం వరకు నాలుగు ఊళ్ళు తిరిగి వ్యాపారం చూసుకుని ఇంటి ముఖం పట్టిన ఆ తండ్రీ కూతుళ్ళకు ఒక కాలువ పక్కన గల ముళ్ళ పొదను తమ గ్రామానికి చెందిన పట్టయ్య ముల్లుకర్రతో పొడుస్తూ కనిపించాడు. దాన్ని చూసిన కూర్మయ్య, ''ఏమిటి పట్టయ్యా, వెతుకుతున్నావు? కుందేలుగాని కనబడిందా?'' అని అడిగాడు కుతూహలంగా.

''కుందేలు కాదు; మంచిరకం తాబేలొకటి కాలువలోంచి బయటకు వచ్చి, ఇప్పుడే ఈ పొదలో దూరింది,'' అంటూ వెతకసాగాడు పట్టయ్య.

తాబేలు అనగానే భక్తితో చెంపలు వేసుకున్న కూర్మయ్య, ''పట్టయ్యా, దాన్ని ఏమీ చేయకు. కూర్మనాథస్వామి మా కులదైవం. నీకు కావాలంటే డబ్బిస్తాను. దాన్ని నాకు ఇవ్వు,'' అంటూ రొండిన దోపుకున్న ఆకుపచ్చ రంగు డబ్బు సంచీని వెలుపలికి తీశాడు. డబ్బును చూడగానే ఎంతో సంతోషించిన పట్టయ్య, అంతలో వెలుపలికి వచ్చిన తాబేలును కూర్మయ్యకు అప్పగించి, డబ్బు పుచ్చుకుని తన దారిన వెళ్ళిపోయాడు.

అంతవరకు నాలుగు కాళ్ళనూ, తలనూ లోపలికి లాక్కున్న తాబేలు, పూర్ణమ్మ దాన్ని ఆప్యాయంగా చేత్తో నిమరడంతో, తలను బయటపెట్టి అటూ ఇటూ వింతగా చూడసాగింది.

గుడిసేవ మురళీధర్



''నీకు ఎలాంటి భయమూ వద్దు. నీ గాయాలకు మందు రాసి మెత్తని గుడ్డ చుడతాను. కొన్ని రోజులు మా ఇంట్లో విశ్రాంతి తీసుకో,'' అంటూ కూర్మయ్య తాబేలును కూతురు దగ్గర నుంచి తన చేతుల్లోకి తీసుకుని, బండిలోని ఖాళీ గంపలో ఉంచాడు.

తరవాత కొద్ది రోజులకే గాయాలు మానడంతో తాబేలు ఎంతో ఆరోగ్యంగా తయారయింది. కూర్మయ్య దానిని భక్తితో తీసుకువెళ్ళి రామవరానికి ఉత్తరంగా ప్రవహిస్తూన్న కృష్ణానది పాయలో వదిలి వచ్చాడు.

ఇది జరిగిన మూడో రోజు ఒక వింత సంఘటన జరిగింది. పట్టణంలోని జమీందారు దివాణం నుంచి ఒక న్యాయాధికారి కూర్మయ్య ఇంటికి వచ్చి అతడి పూర్వీకుల వివరాలు అడిగాడు.

''మా నాన్నకు ముగ్గురన్నదమ్ములు, ఒక అక్కగారు. వాళ్ళ నాన్నకు అంటే మా తాతగారికి అన్నదమ్ములు లేరుగాని ఒక చెల్లె ఉండేదట. వాళ్ళ తాత రాజుగారి ఆస్థానంలో మల్లయుద్ధ వీరుడుగా పేరు పొందాడట. ఆయన పేరు జెట్టి జగ్గయ్య అని చెప్పుకునేవారు; ఆయన రాజుగారి నుంచి ఘనంగా సన్మానాలు కూడా అందుకున్నాడట,'' అంటూ కూర్మయ్య తన తండ్రి తాతలు చిన్నప్పుడు చెప్పిన విషయాలను గుర్తుకు తెచ్చుకుంటూ వివరించాడు.

''కూర్మయ్యా, నువ్వు చెప్పే సంగతులు వాస్తవాలేనని రుజువు చేయడానికి నీ దగ్గర సాక్ష్యాధారాలు ఏమైనా ఉన్నాయా?'' అని అడిగాడు న్యాయాధికారి.

''ఉన్నాయి బాబూ,'' అంటూ కూర్మయ్య ఇంటిలోపలికి వెళ్ళి, పాత ఇనుప పెట్టెలో దాచిన తమ వంశవృక్షం వివరాలు గల తాళపత్రం తెచ్చి చూపించాడు.

న్యాయాధికారి తన చేతి సంచీలోంచి ఒక కాగితం తీసి, కూర్మయ్య ఇచ్చిన తాళపత్రంతో పోల్చి చూసి, ''కూర్మయ్యా, నేను వెతుక్కుంటూ వచ్చిన వ్యక్తివి నువ్వే. నువ్వు చాలా అదృష్టవంతుడివి. నీకు నీ పూర్వీకుల నుంచి పెద్ద ఆస్తి సంక్రమించింది. నీ ఆస్తిని నీకు అప్పగించమని జమీందారు నన్ను పంపారు. వెంటనే పట్నం బయలుదేరు,'' అన్నాడు సంతోషంగా.

ఆ విధంగా కూర్మయ్య కుటుంబం ఒక్క నెల తిరిగేసరికి పట్నంలోని పెద్ద భవంతికి చేరి ధనవంతుల కుటుంబంగా పేరుపొం

దింది. కూర్మయ్యకు పట్టిన అదృష్టం గురించి రామవరంలో గొప్పగా చెప్పుకోసాగారు.

ఒకసంవత్సరం రోజులు గడిచిపోయాయి. ఒకనాటి ఉదయం కూర్మయ్య ఇంటి ముందు పదిమంది చేరి ఏదో గొడవ ప్రారంభించారు. ఇంతకూ, ఆ గొడవ చేస్తున్న వాళ్ళు కూర్మయ్య స్వగ్రామమైన రామవరానికి చెందినపట్టయ్య; అతడి కొడుకు మల్లయ్య.

''మనిషంటే మాట మీద నిలబడాలి. ఈ రోజు నాలుగు డబ్బులు వచ్చినంత మాత్రాన ఇచ్చిన మాట తప్పుతావా? అయినా నీ నడ మంత్రపు సిరి ఎక్కడి నుంచి వచ్చిందనుకు న్నావు? నేనిచ్చిన తాబేలు ద్వారా పట్టిన అదృష్టం వల్లనే కదా? ఆ సంగతి ఇంతలోనే మరిచి పోయావా?'' అని పట్టయ్య నానా రభస చేస్తున్నాడు.

''ఇంతకూ నన్ను ఏం చేయమన్నావు పట్టయ్యా?'' అని అడిగాడు కూర్మయ్య నెమ్మదిగా.

''ఏమీ ఎరగనట్టు ఏమిటా నంగనాచి మాటలు? నీ కూతురు పూర్ణమ్మను నా కొడుకు మల్లయ్యకిచ్చి పెళ్ళి చేస్తానన్నావు కదా? ఇప్పుడు కాదంటావేమిటి? పైగా వాళ్ళిద్దరూ ఒకరినొకరు ఇష్టపడ్డారు కూడా,'' అన్నాడు పట్టయ్య.

''ఇదిగో పట్టయ్యా, మేము పట్నం వచ్చాక, మీ అబ్బాయికి మా అమ్మాయినిచ్చి చేయ మని చాలా సార్లు వచ్చావు. అందుకు నేను ఒప్పుకోలేదని ఈ నాటకం ఆడుతున్నావా?'' అన్నాడు కూర్మయ్య కోపంగా.

''నువ్వు అలా అంటావనే మన ఊరి వాళ్ళను వెంట బెట్టుకు వచ్చాను,'' అన్నాడు





పట్టయ్య వాళ్ళకేసి చేయి చూపుతూ. వాళ్ళం దరూ, ''అవును, పట్టయ్య కొడుక్కు నీ కూతురునిచ్చి పెళ్ళి చెయ్యాల్సిందే,'' అన్నారు ఒక్కసారిగా.

వాళ్ళ అబద్ధపు మాటలకు తండ్రీ కూతుళ్ళు దిగ్భ్రాంతి చెంది, ఒకరినొకరు చూసుకోసాగారు. దాన్ని అవకాశంగా తీసు కుని, ''ఏమిటి పూర్ణమ్మా, మీ నాన్నలాగా నువ్వు మమ్మల్ని మరిచి పోయావా?'' అన్నాడు పట్టయ్య వ్యంగ్యంగా.

పూర్ణమ్మ మౌనంగా తలవంచుకుని ఇంట్లోకి వెళ్ళిపోయింది. అంతలో అక్కడ జరుగుతూన్న గొడవకు చుట్టు పక్కలవాళ్ళు గుమిగూడారు. కూర్మయ్యను మాట్లాడనీయ కుండా పట్టయ్య చిందులు వేస్తూ ఏవేవో చెబుతున్నాడు.

కొంతసేపటికి న్యాయాధికారి అటుకేసి రావడంతో సద్దు మణిగింది. న్యాయాధికారి పట్టయ్య చెప్పినదంతా సావధానంగా విని తల పంకించి, ''మీ అబ్బాయి మల్లయ్యకూ, కూర్మయ్య కూతురు పూర్ణమ్మకూ పెళ్ళి ఖాయమయిందనీ, ఇంతలో ఎదురు చూడని ఆస్తి కలిసి రావడంతో కూర్మయ్య ఇచ్చిన మాట తప్పాడంటావు. అదే నిజమయితే, కూర్మయ్య చేసింది తప్పేకదా!'' అన్నాడు.

''ధర్మ ప్రభువులు న్యాయం చిటికలో గ్రహించారు. తమరే నాకు న్యాయం జరిగేలా చూడాలి,'' అన్నాడు పట్టయ్య.

అదేసమయంలో ప్రముఖ బట్టల వ్యాపారి రామలింగయ్య హడావుడిగా అక్కడికి వచ్చి, ''ఏమిటీ, నేను విన్నది నిజమేనా? పూర్ణ మ్మకు ద్వితీయ వివాహమా!'' అని కూర్మ

య్యను నిలదీశాడు. ఏం జరుగుతున్నదీ తెలియక కూర్మయ్యకు నోట మాట రాలేదు.

''ఏమిటి మీరనేది? కాస్త వివరంగా చెప్పండి రామలింగయ్యా,'' అని అడిగాడు న్యాయాధికారి.

''పూర్ణమ్మకూ, మా అబ్బాయికీ ఇదే ఊళ్ళో ఆరు నెలల క్రితం వివాహం జరిగింది,'' అన్నాడు రామలింగయ్య.

''నిజంగానే పూర్ణమ్మకు ఆరు నెలల క్రితం మీ అబ్బాయితో వివాహం జరిగి ఉన్నట్టయితే, పట్టయ్య చేసే ఆరోపణలు చెల్లవు,'' అన్నాడు న్యాయాధికారి గంభీరంగా.

సరిగ్గా అప్పుడే ఒక వృద్ధుడు జనంలోంచి ముందుకు వచ్చి, పట్టయ్యను పరిశీలనగా చూస్తూ, ''ఒరే పట్టయ్యా, నీ పాపిష్టి బుద్ధులు ఇంకా పోలేదా? ఎడా పెడా అప్పులు చేసి ఊరి నుంచి పారిపోయావు కదా? మళ్ళీ ఎప్పుడు వచ్చావు?'' అన్నాడు.

పథకం బెడిసి కొట్టి, పరిస్థితి తనకు ప్రతికూలంగా మారడంతో పట్టయ్య అక్కడి నుంచి పారిపోవడానికి చూశాడు. కాని కొందరు అతన్ని చుట్టుముట్టి పట్టుకున్నారు. మల్లయ్యతో సహా అతడి వెంటవచ్చిన గ్రామస్థులు దిక్కుకొకరు పారిపోయారు.

''ఇలాంటి దుష్టుణ్ణి కఠినంగా శిక్షించాలి. వదిలిపెడితే పలువురు అమాయకులు నష్టపోతారు,'' అన్నారు న్యాయాధికారితో అక్కడ చేరిన వాళ్ళు. పట్టయ్యకు మూడు నెలల కారాగార శిక్ష విధించాడు న్యాయాధికారి.

సమయానికి వచ్చి కాపాడిన న్యాయాధికారికి కూర్మయ్య కృతజ్ఞతలు తెలియజేశాడు.

''నీలాంటి నిజాయితీ పరులకు దుష్టుల వల్ల సమస్యలు ఎదురైనా అవి మంచు తెరల్లా తొలగిపోతాయి. అయినా సమయానికి నేనిక్కడికి రావడానికి కారణం నీ కుమార్తె పూర్ణమ్మ. వీధిలో గొడవ పడుతూంటే, ఆమె పెరటి దారిగుండా ధైర్యంగా వచ్చి, నన్ను చూసి సంగతి వివరించి సాయం అర్థించింది. పట్టయ్య అసూయతో నిన్ను వంచించడానికి పథకం వేశాడని గ్రహించాను. నా మనుషులతో నాటకం ఆడించి, దోషిని పట్టుకుని శిక్షించగలిగాను,'' అన్నాడు న్యాయాధికారి.

చిన్నగా నవ్వుతూన్న తన కుమార్తెను అభినందిస్తూన్నట్టు చూశాడు కూర్మయ్య.



# విజ్ఞత!

కొమరయ్య పరమ పిసినారి. ఆయనకు ఏడేళ్ళ మనమరాలు ఉంది; పేరు గీత. ఒకనాడు ఒకడు అద్దాల పెట్టెలో తినుబండారాలు అమ్ముతూ కొమరయ్య ఇంటి ముందుకు వచ్చాడు. వాటిని చూడ గానే గీతకు తినాలని కోరిక కలిగి, ''తాతయ్యా, మిఠాయి కొనుక్కుంటాను, డబ్బు ఇవ్వు,'' అని అడిగింది కొమరయ్యను.

డబ్బు అనే మాట వినగానే కొమరయ్య ఉలిక్కి పడ్డాడు. ఆ తరవాత తేరుకుని, ''సరే, గీతా. నేను ఒక ప్రశ్న వేస్తాను. సరిగ్గా సమాధానం చెప్పావంటే నీకు డబ్బులు ఇస్తాను,'' అన్నాడు.

''అలాగే తాతయ్యా, అడుగు,'' అన్నది గీత.

కొమరయ్య రొండిన దోపుకున్న ఒక చిల్లు నాణెం, ఒక బంగారు నాణెం తీసి గీతకు చూపించి, ''ఈ రెండింటిలో ఏది పెద్దది?'' అని ప్రశ్నించాడు. పరిమాణంలో చిల్లునాణెం పెద్దదిగా ఉండడంతో, గీత దాని కేసి చూపుతూ, ''ఇదె పెద్దది,'' అన్నది.

''కాదు బంగారు నాణెం పెద్దది,'' అంటూ కొమరయ్య, అది ఎలా పెద్దదో వివరించి చెప్పాడు సంతోషంగా. ''తాతయ్యా, నేను ఓడిపోయాను. ఇప్పుడు నేనొక ప్రశ్న వేస్తాను. నువ్వు సమాధానం చెబుతావా?'' అని అడిగింది గీత.

చిన్నపిల్ల అడిగే ప్రశ్నకు సమాధానం చెప్పలేనా అనుకుని, ''సరే, అడుగు,'' అన్నాడు కొమరయ్య.

''అయితే, ఒక షరతు,'' అన్నది గీత. ''ఏమిటి?'' అని అడిగాడు కొమరయ్య.

''తాతయ్యా, నేను ఓడిపోతే ఇంకెప్పుడూ నిన్ను డబ్బులు అడగను. నువ్వు ఓడిపోతే, చిల్లు నాణెంతో పాటు బంగారు నాణెం కూడా నాకు ఇవ్వాలి, సరేనా?'' అన్నది గీత. కొమరయ్య సంతోషంగా ఒప్పుకున్నాడు. ''తాతయ్యా, ఒంటె పెద్దదా? ఒంటె పిల్ల పెద్దదా?'' అని ప్రశ్నించింది గీత.

''ఇందులో సందేహం ఎందుకు, ఒంటే పెద్దది,'' అన్నాడు కొమరయ్య.

''పప్పులో కాలు వేశావు తాతయ్యా! ఒంటెపిల్ల వయసెంతో నువ్వు అడగలేదు. ఒంటెపిల్ల కూడా పెద్దదే. అది పుట్టి పదేళ్ళు అవుతోంది,'' అన్నది గీత. కొమరయ్య మనమరాలు తెలివికి మురిసి పోతూ, ఆమె అడిగినట్టు రెండు నాణాలూ ఆమెకు ఇచ్చాడు.

– టి. రాజేంద్ర






# రాకాసిలోయ

## 17

[కేశవుడూ, అతడి అనుచరులూ నది ఆవలి తీరం చేరగానే, బానిసల వ్యాపారం చేసే ఒక స్థూల కాయుడి నౌకర్ల చేత ఎదుర్కోబడ్డారు. కేశవుడూ, జయమల్లూ వాళ్ళకు దొరికి పోయారు. ముసలివాడు, కోయయువకుల జాడలేదు. మరుసటి రోజున బానిసలను కొనేందుకు విలువైన దుస్తులు ధరించిన ఇద్దరు వర్తకులు స్థూలకాయుడి గుడారాల దగ్గిరకు వచ్చారు. తరవాత-]

స్థూలకాయుడు వర్తకులకు కేశవుణ్ణీ, జయ మల్లునూ చూపుతూ, "చూశారా, కారు పోతుల్లా ఎలా వున్నారో! నది కవతల వున్న జలపాతం మీది నుంచి, ఛడేల్‌మని నదిలోకి ఒక్క దూకు దూకి, ఫటేల్ ఛటేల్ మంటూ కొరమీనుల్లా, ఈ దరికి కనుమూసి తెరిచేం తలో ఈదుకొచ్చారు. వీళ్ళను, ఎక్కడా ఒళ్ళు కంద కుండా, దెబ్బ తగలకుండా పట్టుకునే ప్రయత్నంలో, నా నౌకర్లు పన్నెండు మంది చచ్చారు. ఆహా ఏం, బలం! ఒక్క పిడికిటి పోటుతో ఒక్కొక్కణ్ణి చంపేశారు...."

స్థూలకాయుడు ఇలా మాట్లాడుకు పోతూంటే, వర్తకులలో ఒకడు, "చాలయ్యా, ఆగు! ఇంతకీ ఒక్కొక్కడికీ ఏ పది బంగారు కాసులో ఇవ్వమనవు గదా?" అన్నాడు.

"పది బంగారు కాసులా! మీరూ నన్ను ముంచాలనుకుంటున్నారా? గడిచిన ఇరువయ్ నాలుగ్గంటల నుంచీ వీళ్ళను నా బిడ్డల్లా సాకుతున్నాను. వీళ్ళకు ఇంత వరకూ పెట్టిన తిండే ముప్పై బంగారు కాసుల పైన చేస్తుంది. వాళ్ళదేం తిండి, ఏం బలం! ఒక పలుగు చేతికిచ్చి చూడండి, కొండల్ని నిలువునా



పిండిచేసి మరీ చూపెడతారు!'' అన్నాడు స్థూలకాయుడు.

వర్తకుల్లో ఒకడు చిరునవ్వు నవ్వుతూ కేశవుణ్ణి సమీపించి, తన చేతికర్రతో అతడి భుజం మీద ఒక్కపోటు పొడిచాడు. కేశవుడికి బాధా, ఎక్కడలేని కోపమూ కలిగింది. కాని, అతడు నిబ్బరంగా ఊరుకున్నాడు. వర్తకుడు పెద్దగా నవ్వుతూ, స్థూలకాయుడి కేసి తిరిగి, ''వీళ్ళను గురించి నువ్వు చెప్పిందాంట్లో కొంత నిజం వున్నట్టుంది. ఆ దెబ్బకు మరొక డైతే కీచు మనవలసిందే,'' అన్నాడు.

ఈ మాటలకు స్థూలకాయుడు పరమానందం చెందిపోయి, ''ఆహా, నే చెప్పలా? ఒక్కొక్కడూ ఒక్కో ఏనుగు గున్ననుకోండి!'' అన్నాడు.

''అంత కర్ర పోటుకూ కుయ్ కయ్ మనలేదు. ఒకవేళ వాడు మూగి వెధవ కాదు కదా?'' అంటూ రెండో వర్తకుడు, కేశవుడికి దగ్గరిగా వెళ్ళి, ''ఏరా, నీకు మాట్టాడటం చాతవ్వా? నీ పేరేమిటి?'' అని అడిగాడు.

కేశవుడు పొంగి వస్తున్న కోపాన్ని అణుచుకుంటూ, ''కనిష్ఠుడు! మనుషుల్ని పశువుల్లా క్రయవిక్రయాలు చేసే మీకు పేర్లతో పనేమిటి?'' అన్నాడు.

''ఆహా చూశారా, ఎంత తెలివైన జవాబిచ్చాడో? శాస్త్రపురాణాల్లోకి ఎక్కాలిసిన మాట!'' అన్నాడు స్థూలకాయుడు పొంగిపోతూ.

''అఘోరించాడు! ఎన్ని నీతివాక్యాలూ, ధర్మపన్నాలూ అయితే ఒక బంగారు కాసు చేసేట్టు! సరే, ధర తేల్చు. ఇద్దరికీ కలిపి ముప్పై కాసులిచ్చుకుంటాం, సరా?'' అన్నాడు వర్తకుడు.

''ఇద్దరికీ కలిపి ముప్పై కాసులు! నన్ను నాశనం చేస్తే మీకేం ఒరుగుతుంది? నేను మునిగి పోతే మీక్కలిగే లాభం ఏమిటి? దేవుడి సాక్షిగా చెపుతున్నాను. వీళ్ళిద్దర్నీ పట్టుకునే ప్రయత్నంలో నా నౌకర్లు పన్నెండు మంది చచ్చారు,'' అంటూ స్థూలకాయుడు నెత్తీ నోరూ కొట్టుకోసాగాడు.

వర్తకులిద్దరూ కొంచెం దూరంగా వెళ్ళి, కొద్దిసేపు సంప్రతించుకుని తిరిగి బానిస వ్యాపారి దగ్గరకు వస్తూ, ''ఆఖరి మాటగా నలభై కాసులిస్తాం. ఇష్టమైతే అమ్ము, లేకపోతే లేదు. మా కవతల చాలా పనులున్నై. ఇంకా ఇరవై మంది బానిసలను కొని, ఆ కొండవాగు పక్కన వుంచి వచ్చాం. త్వరగా ప్రయాణమై పోవాలి,'' అన్నారు.

''ఇలా వ్యాపారం జరిగితే ఇకనేను మట్టి కొట్టుకు పోవలసిందే. దీనికన్న గుడారా లెత్తివేసి, ఏ గుహలోనో ముక్కు మూసుకు కూచుని తపస్సు చేసుకోవటం లాభసాటిగా వుంటుంది,'' అంటూ స్థూలకాయుడు అటూ ఇటూ గెంతసాగాడు.

బానిసల బేరం ఈ విధంగా గంట సేపు సాగి, ఆఖరుకు అరవై బంగారు కాసులకు తేల్చి వేయబడింది. స్థూలకాయుడు వర్త కుల దగ్గిర్నుంచి అరవై కాసులూ తీసుకుని, వాటిని రొండికి బిగించి వున్న పట్టా సంచీలో దాస్తూ, ''మళ్ళీ ఎప్పుడు, మీ దర్శనం? ఒక్క నెల రోజు లాగి వచ్చారంటే, మేలిమి బంగారం లాంటి సరుకు ఒప్ప చెపుతాను,'' అన్నాడు.

''రాకేం, వస్తాం. మన లావాదేవీలు దీన్తోనే అయిపోయిన వనుకుంటున్నావా? కాని, నీ నుంచి ఒక్క సహాయం కావాలి,'' అన్నారు వర్తకులు.

''ఏమిటా సహాయం?'' అంటూ స్థూల కాయుడు వర్తకుల కేసి అనుమానంగా చూశాడు.

''మరేం లేదు. ఈ మధ్య కొంత కాలంగా మన కపిల రాజ్యమంతా అరాజకంగా వున్న దని నీకు తెలియంది కాదు. కత్తి చేత బట్ట గల వాడల్లా, దారిదోపిడిగాడుగా తయార య్యాడు. మా దగ్గిర చూడబోతే, చాలా విలు వైన సరుకుండె-ముప్పై ఇద్దరు బానిసలు. రెండు మజిలీల ప్రయాణంలోగాని మేం కపిలపురం చేరలేం. ఈ రాత్రి అడవిలో మజిలీకి నువ్వు కాస్త తోడు రావాలి,'' అన్నారు వర్తకులు.



స్థూలకాయుడు మండ్రగబ్బ కాటు తిన్న వాడిలా ఎగిరి పడి, ''ఒక్క గంట కాలం నా గుడారాలను నౌకర్లకు ఒప్ప చెప్పి ఎక్కడికైనా వెళ్ళానో, నా వ్యాపారం గుణ్ణమే. అందరూ దొంగవెధవలు. నేను చాల నష్టపడి పోతాను,'' అన్నాడు.

వర్తకులు చిరునవ్వు నవ్వుకుని, ''ఈ రాత్రి మా వెంట వున్నందుకు, నాలుగు బంగారు కాసు లిచ్చుకుంటాం, సరా?'' అన్నారు.

''నాలుగు బంగారు కాసుల్లో నా నష్టం పూడుతుందా? పది....ఎనిమిది......సరే, ఐదు ఇవ్వండి, ఇక బయలుదేరుదాం,'' అంటూ స్థూలకాయుడు కొరడా ఝళిపిస్తూ కేశవుడూ, జయమల్లుల కేసి వెళ్ళాడు.

కేశవుడూ, జయమల్లులను వెంట బెట్టు కుని, వర్తకులిద్దరూ, స్థూలకాయుడూ అరణ్య మార్గాన నడిచి, ఓ గంట తరవాత ఒక కొండ




వాగు దరికి చేరారు. అక్కడ ముప్ఫై మంది బానిసలు, నౌకర్ల కాపలాలో గంధపు చెక్క నరుకుతున్నారు. వాళ్ళను చూస్తూనే స్థూల కాయుడు పెద్దగా నవ్వి, "బానిసలను కొన టానికైన ఖర్చు, వాళ్ళు మోసుకొచ్చే మంచి గంధంచెక్క అమ్మితే వస్తుంది. ఇక, వాళ్ళ నమ్మగా వచ్చిన డబ్బంతా లాభమే. ఆహా ఎంత తెలివైన వాళ్ళయ్యా, మీరు!" అన్నాడు.

వర్తకులు ముసిముసి నవ్వులు నవ్వు కుంటూ, తమ నౌకర్లకు ప్రయాణం కావల సిందని హెచ్చరికలు చేశారు. చూస్తూండ గానే నౌకర్లు, బానిసల చేత నరికిన గంధం చెక్క అంతా కట్టలు కట్టించి, వాళ్ళను ఒక సోలుపుగా నడుపుతూ, కొరడాలు ఝుళి పిస్తూ బయలుదేరారు. అందరికన్నా ముందు స్థూలకాయుడు నడవసాగాడు.

మహా వృక్షాలతో, చిన్నా పెద్ద జలపాతా లతో, ఊబి నేలలతో మహా భయంకరంగా వున్న అరణ్యంలో పడి, అందరూ సూర్యా స్తమయం వరకూ నడిచారు. వారికి దారి పొడు గునా సింహ గర్జనలూ, ఏనుగుల ఘీంకా రాలూ వినిపించ సాగినై. అలాంటి సమ యాల్లో స్థూలకాయుడు అదిరిపడుతూ, "ఐదు కాసుల కోసం, నేనేం ప్రాణగండం తెచ్చుకోలేదు గదా," అనుకోసాగాడు భయం భయంగా.

సూర్యాస్తమయమైన కొద్ది సేపటికల్లా అరణ్యాన్ని గాఢాంధకారం అలముకొన్నది. బానిస లందర్నీ సమతలంగా వున్న ఒక చోట మందవేసి, అడవి మృగాలు మీదపడకుండా వుండేందుకు రక్షణగా, వాళ్ళ చేత చుట్టూ ముళ్ళ పొదలు ఎత్తుగా వేయించారు. ఆ

రక్షణల మధ్య రెండు మూడు చోట్ల పెద్ద నెగళ్ళు వెలిగించారు. ఆ తరవాత అందరికీ ఎండు రొట్టెలూ, కాల్చిన మాంసమూ ఆహారంగా పెట్టారు.

రాత్రి గడుస్తున్న కొందికీ ముళ్ళ పొదల కావలి నుంచి సింహాలు చేసే గర్జలు అధికం కాసాగాయి. కేశవుడూ, జయమల్లూ పక్క పక్కల పడుకుని తమ భవిష్యత్తును గురించి తీవ్రంగా మథన పడసాగారు. కేశవుడికి తన తండ్రి ఏమయిపోయాడన్న దిగులు అధికం కాసాగింది.

''మల్లూ, మా అయ్య క్షేమంగా వుండి వుంటాడంటావా?'' అని అడిగాడు కేశవుడు.

''అతడి కొచ్చిన ప్రమాదం ఏమీ లేదు. ఈ అరణ్యంలోనే ఎక్కడో కోయ యువకులిద్దరితో దాక్కుని వుంటాడని నా నమ్మకం,'' అన్నాడు జయమల్లు.

కేశవుడికి జయమల్లు మాటల్లో విశ్వాసం కలగలేదు. అతడు మరేదో ప్రశ్నించ బోయేంతలో హఠాత్తుగా సింహ గర్జనలు ఆగిపోయినై. కేశవుడు ఉలిక్కిపడి లేచి కూచుంటూ, ''మల్లూ, అంతా నిశ్శబ్దం అయింది. ఏదో ప్రమాదం...'' అనేంతలో, భీకరంగా గర్జిస్తూ ఒక సింహం ముళ్ళ పొదల మీది నుంచి కుప్పించి లోపలికి దూకింది. నిద్రపోతున్న బానిసలంతా ఒక్కసారి లేచి, హాహాకారాలు చేశారు. స్థూలకాయుడూ, వర్తకులిద్దరూ కీచుమనే గొంతులతో, ''బాణాలు.... కత్తులు... ఈటెలు.... చంపండి, సింహాన్ని చంపండి!'' అని తమ నౌకర్లను హెచ్చరిస్తూ ఒక పక్కకు పారిపోయారు.

నౌకర్లు సింహం మీదికి రివ్వురివ్వు మంటూ బాణాలు వదిలారు. కాని, ఒక్కటీ దాన్ని తాకలేదు. ఈ లోపల సింహం, గొలుసులతో



బంధించబడి వున్న బానిసల గుంపు మీద పడి, ఇద్దరు ముగ్గుర్ని తన పంజా దెబ్బలతో గాయపరిచింది.

కేశవుడూ, జయమల్లూ ఒకే జట్టుగా నెగళ్ళ దగ్గిరకు పరిగెత్తి, మండుతున్న రెండు కట్టెపుల్లలను తీసుకుని, "బాణాలు వేసి సింహాన్ని మరింతగా రెచ్చకొట్టకండి. దాన్ని మేం బయటికి తరిమేస్తాం!" అంటూ సింహంకేసి పరిగెత్తారు.

మండుతూన్న కట్టెపుల్లలను చూస్తూనే, సింహం ఓ తృటికాలం తటపటాయించి, అంతలోనే పెద్దగా కోరలు చాచి, ముందున్న కేశవుడి మీదికి లంఘించింది. కేశవుడు దాని పంజా దెబ్బను తప్పుకుంటూ, తన చేతిలో వున్న మండే కట్టెను దాని మీదికి విసిరాడు. మంట తన శరీరాన్ని తాకగానే సింహం ఒక్క సారి పెద్దగా గర్జించి వెనక్కు తిరిగింది. అదే సమయంలో జయమల్లు తన చేతిలో వున్న కట్టెను దాని వెన్నుకు తగిలేలా కొట్టాడు.

సింహం మెరుపులా ముళ్ళపొదలమీంచి లంఘించి అరణ్యంలోకి పారిపోయింది. స్థూలకాయుడూ, వర్తకులిద్దరూ కేశవుడూ జయమల్లుల దగ్గిరకు వచ్చారు. స్థూల కాయుడు నిలువెల్లా వణికి పోతున్నాడు. వర్తకుల మాట చెప్పనవసరమే లేదు.

"మీ ఇద్దరూ, మమ్మల్ని ఎంతో ధన నష్టాన్నుంచి కాపాడారు. ఇద్దరు బానిసలు చచ్చారు, ఒకడు గాయపడ్డాడు. అదేమంత పెద్ద నష్టం కాదు. మీరు చూపిన ధైర్యానికీ, చేసిన సహాయానికీ, ఈ నాటి నుంచీ మీకు తిన్నంత ఆహారం పెట్టదలిచాం," అన్నాడొక వర్తకుడు.

"ఓ అలాగేచేద్దాం. కుల నగరంలో వీళ్ళిద్దరినీ అమ్మేటప్పుడు, ఈ జరిగిన సంగతి గుర్తుంచుకుని, కొంచెం మంచి ధర రాబట్టాలి. ఒకవేళనేను మరిచిపోతే, నువ్వు కాస్త గుర్తు చెయ్యి," అన్నాడు రెండో వర్తకుడు, తన తోటివాడితో.

"అందరూ కలిసి నన్ను ముంచారు. వీళ్ళింత అసహాయ శూరులని తెలిస్తే, అర్థవై కాసులకు అమ్మేవాడినా? నేను గుణ్ణమయిపోయాను..... దివాళా ఎత్తిపోయాను...." అంటూ స్థూలకాయుడు కుప్పిగంతులు వేయసాగాడు. -(ఇంకావుంది)





బేతాళ కథలు

# కీర్తికాంక్ష

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఎలాంటి అద్భుత శక్తులను సాధించగోరి, అర్ధరాత్రివేళ ఇలా కఠోర శ్రమ చేస్తున్నావో నాకు తెలియదు. అయితే, కొందరు అపూర్వమైన సాహసకృత్యాలు చేసి సాధించిన అద్భుత శక్తులను సైతం, చేజేతులా జార విడుచుకుంటారు. ప్రాణ భయంతో కలిగే అయోమయ చింతన వల్ల కూడా కొందరిలో ఒక్కొక్కసారి ఇలాంటి అనూహ్యమైన మార్పులు వస్తూంటాయి. అలాంటి అయోమ



యానికిలోనై, హఠాత్తుగా మారిపోయిన వితంగుడనే సాహస యువకుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

విక్రముడు రాజ్యమేలే కాలంలో విలోమ దేశానికి రాక్షస బాధ వచ్చి పడింది. పాతాళం నుంచి రాక్షసులు హఠాత్తుగా భూమ్మీదికి వచ్చి, అందిన మనిషిని భక్షించి వెళ్ళేవారు. ఈ రాక్షసుల బాధను అరికట్టడం ఎలాగా అని విక్రముడు సతమతమవుతూన్న సమయంలో రాజధానికి విరూపాక్షుడనే ముని వచ్చాడు. రాజు ఆయనకు అతిథి మర్యాదలు చేసి, తన సమస్య చెప్పుకున్నాడు. తపోసంపన్నుడైన విరూపాక్షుడి వద్ద ఒక మాయా దర్పణం ఉన్నది. ఆయన పాతాళలోకం రాక్షసరాజు మహాబలిని అందులోకి రప్పించి, విక్రముడి సమస్యను వివరించాడు.

మహాబలి వినయంగా, ''మునివర్యా, పులికి లేడి ఆహారం. రాక్షసుడికి మనిషి ఆహారం. ఇది దైవనిర్ణయమని మరువక ఈ సమస్యకు తమరే ఒక న్యాయమైన పరిష్కార మార్గం సూచించండి,'' అన్నాడు.

విరూపాక్షుడు కాసేపాలోచించి, ''ఇక మీదట భూమ్మీది కొచ్చిన రాక్షసులు నరుల్లో పుణ్యాత్ములను వదిలి పాపుల్ని మాత్రమే భుజించాలి. నియమభంగం చేసిన రాక్షసులకు భరించలేని పంటినొప్పిశిక్ష. ధైర్యవంతుడైన నరుడా రాక్షసుడినోట్లో ప్రవేశించి, అభయారణ్యంలోని వనమూలికలతో దంతధావనం చేస్తే తప్ప ఆ బాధ తగ్గదు,'' అన్నాడు.

మహాబలి ఆ నియమానికి అంగీకరించి దర్పణం నుంచి మాయమయ్యాడు. ముని మాయాదర్పణాన్ని విక్రముడికిచ్చి, ''నీకేదైనా ఇబ్బంది కలిగితే నన్ను తలుచుకో. నేనీ అద్దంలో కనబడి పరిష్కార మార్గాలు చెబుతాను,'' అని వెళ్ళిపోయాడు.

ఆ తరవాత రాక్షసుల వాతబడే నరుల సంఖ్య క్రమంగా తగ్గుతూ వచ్చింది. మహాబలితో విక్రముడి ఒప్పందం గురించి దేశమంతా ప్రచారం కావడంతో రాక్షసుల వాతబడ్డవారు పాపాత్ములని అంతా నమ్మసాగారు. అలా దేశపౌరుల్లో పాపభీతి కూడా బాగా పెరిగింది.

ఆ కాలంలోనే అభయారణ్యాన్ని ఆనుకుని వున్న వికాసపురం గ్రామంలో శ్రీతంగుడనే భూస్వామి, అందరికీ సాయపడుతూ చుట్టుపక్కల మంచివాడన్న పేరు తెచ్చుకున్నాడు. ఆయనకు లేకలేక కలిగిన ఒక్కగానొక్క బిడ్డ

వితంగుడు. మితిమించిన గారాబం వల్లనో ఏమో వితంగుడు చిన్నప్పటి నుంచీ స్వార్థ పరుడుగా తయారయ్యాడు. ఇంట్లో అందరూ మెచ్చుకుంటే సంతోషపడి, బయటి పిల్లలు కూడా తనను మెచ్చుకోవాలని ఉబలాట పడేవాడు. మెచ్చని వాళ్ళను తిట్టేవాడు. దాంతో చుట్టుపక్కల పిల్లలు అతనికి దూరంగా ఉండేవారు. ఈ విషయమై అతడు తన తాతకు ఫిర్యాదు చేస్తే ఆయన, ''బయటి వాళ్ళు నిన్ను మెచ్చాలంటే, వాళ్ళకు నచ్చేలా మసలుకోవడం తప్ప వేరే మార్గం లేదు,'' అని హెచ్చరించాడు.

''నేను నాకిష్టమైన పనులే చేస్తాను. వాళ్ళకు నచ్చే పనులు చేయను. అయినా వాళ్ళు నన్ను మెచ్చుకోవాలి,'' అన్నాడు వితంగుడు.

వితంగుడికి ఇంకా బుద్ధి వికసించలేదని గ్రహించిన తాత, అతన్ని ఆ ఊళ్ళోని మహా పండితుడు విద్యానాధుడి వద్ద విద్యాభ్యాసానికి పంపాడు. అక్కడ అందరిమెప్పూ పొందాలన్న కాంక్షతో వితంగుడు ఎంతో కష్టపడి చదివాడు. చేరిన ఒక్క సంవత్సరంలోనే అందరిలోకీ మిన్న అయ్యాడు. కానీ, తనను మెచ్చుకోరేమని ప్రతిరోజూ సాటి శిష్యులతో గొడవపడుతూండేవాడు. వాళ్ళు విసిగిపోయి గురువుకు చెప్పారు. గురువు అతన్ని సంజాయిషీ అడిగాడు.

''నేను శిష్యులందరిలోకీ మిన్న. వాళ్ళు నా తెలివిని మెచ్చుకోవడానికి బదులు ఫిర్యాదుచేస్తే, తమరు వాళ్ళను మందలించక పోవడం ఆశ్చర్యంగా ఉంది,'' అన్నాడు వితంగుడు నిష్ఠూరంగా.



''శిష్యుల్లో మిన్న కాబట్టి నీకు తెలివి ఉంది. తోటి శిష్యులు నిన్ను ఇష్టపడడం లేదు కాబట్టి ఆ తెలివి నీకు ఉపయోగపడడం లేదు. డబ్బయినా, తెలివైనా అక్కరకొస్తేనే విలువ. తమకు ప్రయోజనం లేకపోతే, గొప్ప వాళ్ళను కూడా ఎవరూ మెచ్చుకోరు. కాబట్టి నిన్ను అందరూ మెచ్చుకోవాలంటే, పది మందికీ ఉపయోగపడే పనులు కూడా చేయాలి,'' అన్నాడు విద్యానాధుడు.

ఆ మాట నచ్చని వితంగుడు తన పద్ధతి మార్చుకోలేదు.

అలా కొన్నేళ్ళు గడిచిపోయాయి. ఒక నాడు ఉదయం విద్యానాధుడు శిష్యుల్ని అభయారణ్యానికి వెళ్ళి, వనమూలికలు తెమ్మన్నాడు. అందరూ వెళ్ళారు. అయితే, వితంగుడు మాత్రం అరణ్యానికి వెళ్ళకుండా గురువు దగ్గరే ఉండిపోయాడు.



విద్యానాధుడిశిష్యులు ప్రవేశించినసమయా నికే అభయారణ్యంలో మహాసురుడనే రాక్షసుడు అడుగు పెట్టాడు. వాడు కొంత కాలం క్రితం, ఆకలి బాధతో విచక్షణ కోల్పోయి పుణ్యాత్ముడైన ఒక నరుణ్ణి పట్టి మింగేశాడు. నియమభంగం ఫలితంగా, వాడికి భరించ లేని పంటినొప్పి మొదలయింది. ధైర్యవంతు డైన నరుడు దొరుకుతాడన్న ఆశతో వాడిప్పుడు అభయారణ్యానికి వచ్చి కంటబడ్డ విద్యానా ధుడి శిష్యులను చూసి, ''నా నోట్లో ప్రవేశించి, మీ దగ్గరున్న మూలికలతో నా పళ్ళు తోమాలి,'' అన్నాడు. వాణ్ణి చూడగానే భయపడిపోయిన శిష్యులు, వాడి మాట వినగానే మూర్ఛ పోయారు.

మహాసురుడు పంటి బాధతో మూలు గుతూ, ఒక చోట చతికిలబడిపోయి వాళ్ళం దరినీ ఒళ్ళో వేసుకున్నాడు.

అడవికి వెళ్ళిన శిష్యులు ఎంతకూ రాక పోయేసరికి, గురువు ఆదేశం ప్రకారం వాళ్ళను వెతుక్కుంటూ వెళ్ళిన వితంగుడు, మహాసు రుణ్ణి చూశాడు. అంతలోనే మహాసురుడు అతన్ని గుప్పిట పట్టుకుని పైకెత్తి తన కోరిక వినిపించాడు. వితంగుడు ఏమాత్రం భయ పడకుండా, ''నేను నీ నోట్లో ప్రవేశించి మూలి కలతో దంతధావనం చేస్తే నీ పంటినొప్పి తగ్గు తుంది. కానీ, అందువల్ల నాకేం ప్రయో జనం?'' అన్నాడు.

''నువ్వు నా పంటి బాధను తొలగిస్తే, నేను నీ కోరికతీరుస్తాను,'' అన్నాడు మహాసురుడు.

''నేను నా కిష్టమైన పనులే చేస్తాను. అయినా, అందరూ నన్ను మెచ్చుకోవాలి. అదీ నా కోరిక. తీర్చగలవా?'' అన్నాడు వితంగుడు.

''నువ్వు నా పంటి బాధను తొలగిస్తే, నా దగ్గరున్న స్తుతీంద్రమనే అద్భుత శక్తిని నీకి స్తాను. అప్పుడు అందరూ నిన్ను పొగుడు తారు,'' అంటూ మహాసురుడు అతన్ని తన ఒడిలోకి జారవిడిచాడు.

వితంగుడు రాక్షసుడి ఒడిలో స్పృహతప్పి పడివున్న సాటి శిష్యుల నుంచి కొన్ని మూలి కలు తీశాడు. మహాసురుడతన్ని అరచేతిలోకి తీసుకుని నోట్లో వేసుకుంటే, తొణక్కుండా బెణక్కుండా అక్కడ నిలదొక్కుకుని మూలిక లతో పళ్ళన్నీ తోమి ఉపశమనం కలిగించాడు. మహాసురుడు అతన్ని నోట్లోంచి తీసి తలను మూడుసార్లు నిమిరి, ''స్తుతీంద్రం నీ వశ మయింది. నీ అంతట నువ్వు పొమ్మనేదాకా ఆ శక్తి నీవద్దే ఉంటుంది. ఇక మీదట నువ్వు మంచి చేసినా, చెడు చేసినా నీకు మంచి పేరే

వస్తుంది,'' అని చెప్పి మాయమయ్యాడు. అంతే! అంతకు ముందెన్నడూ అతన్ని మెచ్చని సాటి శిష్యులు–నిర్భయంగా రాక్ష సుడి నోట్లో ప్రవేశించిన అతడి ధైర్యం అసాధారణమంటూ ముక్తకంఠంతో మెచ్చుకున్నారు. గురువేమో, ''నీకిక నేను నేర్పాల్సిన విద్యలేవీ లేవు,'' అన్నాడు. ఒకరోజు గ్రామాధికారి అతన్ని కలుసుకుని, ''నీ అనుచరుడిగా ఉంటూ, నీ మాటను శిలాశాసనంగా భావిస్తాను,'' అన్నాడు.

వికాసపురంలో వితంగుడిమాటకు తిరుగు లేకుండా పోయింది. అతడు ఏం చేసినా స్తుతీంద్రం మహిమవల్ల అందరూ అతన్ని మెచ్చుకోవడంవల్ల, అతడు అవినీతికీ, అక్రమాలకూ పాల్పడ్డాడు. గ్రామస్థులు ఊరికేం మేలు జరిగినా వితంగుడే కారణమని పొగిడేవారు. కష్టాలొస్తే విధిలీల అని సర్దుకునేవారు. స్తుతీంద్రం మహిమతో వితంగుడి ఖ్యాతి గ్రామాంతరాలకు పాకింది. గ్రామాధికారులందరూ వితంగుడికి అనుచరులై అవినీతికి పాల్పడసాగారు. క్రమంగా అతడి పేరు రాజధానికి చేరింది. రాజు విక్రముడు చారులను పంపి అసలు విషయం గ్రహించి – వితంగుడి ప్రభావం రాజధానిపై పడితే దేశం సర్వనాశనం కాగలదని కలవరపడ్డాడు. తరుణోపాయం తోచక ఆయన తన వద్దవున్న మాయాదర్పణాన్ని ఆశ్రయించాడు.

అందులో ప్రత్యక్షమైన విరూపాక్షుడు విషయం తెలుసుకుని, ''నేను మహాబలిని కలుసుకుని, ఒకయేడాది తరవాత నీ దేశంలో ఉన్న అవినీతి పరుల్లో ముఖ్యమైన వారిని



గుర్తించి, ఒక్కసారిగా మింగడానికి రాక్షసులను పంపే ఏర్పాటు చేస్తాను. ఇది తెలిస్తే, ఏడాది గడువులో నీ దేశంలోని అవినీతిపరులందరూ మారిపోతారు. మారని వాళ్ళు రాక్షసులకు ఆహారమవుతారు,'' అన్నాడు.

''మీ ఉపాయం బాగానే ఉన్నది గాని, అసలు సమస్యంతా వితంగుడిలోనే. పరపీడన చేస్తూ కూడా స్తుతీంద్రమనే శక్తితో అందరి మెప్పు పొందుతూన్న అతన్ని అదుపు చేయడం ఎలా అన్నదే సమస్య,'' అన్నాడు విక్రముడు దిగులుగా.

''నీకా విచారం వద్దు. వితంగుణ్ణి ప్రశంసిస్తూ శాసనాలు రాయించు. దానితో పాటు అవినీతి పరులకు రానున్న ఆపదను చాటింపు వేయించు. నీ సమస్య పరిష్కారమవుతుంది,'' అని చెప్పి మాయమయ్యాడు విరూపాక్షుడు.

విక్రముడు, విరూపాక్షుడు చెప్పినట్టు చేశాడు. యేడాది గడిచేసరికి, చాలామంది ప్రజలతో పాటు వితంగుడిలోనూ మంచి మార్పు వచ్చింది. పైగా అతడు స్తుతీంద్రాన్ని వదులుకుని మంచి పనులు చేయడం ప్రారంభించాడు. విలోమదేశం ధర్మాత్ములకు నిలయంగా మారింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, చెడ్డ పనులు చేసినా సరే, ఎదుటివారు తనను పొగడాలనీ, తన పంతం నెగ్గించుకునే విషయంలో పట్టుదలతో వ్యవహరించే వితంగుడు హఠాత్తుగా మంచి వాడుగా మారిపోవడానికి కారణం అతనిలో ప్రాణభయం వల్ల ఏర్పడిన అయోమయమే కదా? ప్రాణభయం మనిషి ఆలోచనలను తల్లకిందులు చేయగలదనడానికి వితంగుడిలో వచ్చిన మార్పే ప్రబల నిదర్శనం కాదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలి పోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''భయాలన్నిటిలోకీ ప్రాణభయం భయంకరమైనదే. అందులో సందేహం లేదు. అయితే, వితంగుడిలో వచ్చిన మంచి మార్పుకు అది కారణం కాదు. కొందరిలో ప్రాణభయం కన్నా, కీర్తి కాంక్ష బలవత్తరమైనది. చేసిన ప్రతిపనికీ అందరి చేతా మెప్పు పొందాలన్నది వితంగుడికి జన్మతః వచ్చిన స్వభావం. అందులో చివరి దాకా ఎలాంటి మార్పూరాలేదు. రాక్షసులకు ఆహారమైనవారు చెడ్డవారని ప్రజలు నమ్ముతారనీ, అలాజరక్కుండా ఉండాలంటే మంచి వాడుగా మారడమొక్కటే మార్గమనీ అతడు గ్రహించాడు. కీర్తికాంక్ష ఉన్నవారు మంచి పనులు చేయడమేకాదు; చెడ్డపనులు కూడా మానగలరు. వితంగుడు ఆ పనే చేశాడు. ఇక స్తుతీంద్రం కారణంగా లభించిన పొగడ్తల కన్నా, రాజు రాయించిన శాసనాలే ఎక్కువ తృప్తినివ్వడంవల్ల అతడు స్తుతీంద్రాన్ని వదులుకున్నాడు. అందువల్ల వితంగుడిలో వచ్చిన మార్పుకు కారణం మరణభయం కాదు; అతని కీర్తి కాంక్ష అన్నది సుస్పష్టం,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : ''వసుంధర'' రచన]








## అసమాన ధైర్యం - అద్భుత సంగీతం

అభేద్యమైన గ్వాలియర్ కోటలోపల తోమార్ రాజు మాన్‌సింగ్ (1486-1516) నిర్మించిన మన్ మందిర్ భవనం ఉంది. సంగీతం అంటే అత్యంత అభిమానం గనక, వసారాలో ఉన్నా సంగీతం వినిపించేలా ఆయన ఆ భవనాన్ని నిర్మించాడు. సంగీతమే మృగనయని అనే ఒక గిరిజన యువతిని ఆయన చేరువకు చేర్చింది. ఆయన ఒకసారి వేటకు వెళ్ళి, ఏనుగుపై తిరిగి వస్తూండగా, దారికి అడ్డంగా రెండు అబోతులు పోట్లాడుకుంటూ ఉండడంతో, ఏనుగు ముందుకు వెళ్ళలేక అలాగే నిలబడి పోయింది. అప్పుడు కొందరు గిరిజన యువతులు అటుకేసి వచ్చారు. వాళ్ళు కూడా ఆ దృశ్యాన్ని చూసి భయపడి పోయారు. కాని, వాళ్ళల్లో ఒక యువతి మాత్రం ధైర్యంగా పోట్లాడే అబోతుల వద్దకు ధైర్యంగా వెళ్ళి, వాటిని విడదీసింది. ఆమె పేరు మృగనయని. మాన్‌సింగ్ ఆమెను తన భవనానికి ఆహ్వానించాడు. అక్కడ ఆమె రాజును తన శ్రావ్యమైన సంగీతంతో మురిపించింది. రాజు ఆమెను పెళ్ళాడాలని అనుకున్నాడు. అయితే, ఆమె గుజార్ తెగకు చెందిన గిరిజన యువతి కావడంతో, పెళ్ళాడలేక పోయాడు. ఆమె కోసం ఆయన ఒక ప్రత్యేక భవనం నిర్మించి, దానికి గుజారీ మహల్ అని పేరు పెట్టాడు. ప్రస్తుతం అది పురాతత్వ వస్తు ప్రదర్శన శాలగా ఉంటున్నది.



# దేవుడికి శిక్ష

హేమగిరిలో వుండే ధర్మదాసు ఆఖరి కొడుకు వీరదాసు. చదువుకునే వయసులో చదువుకో కుండా, ఆటపాటలతో గడిపేశాడు. వయ సొచ్చాక చెడుస్నేహాలు మరిగాడు. పొలం పనుల్లో తండ్రికీ, అన్నలకూ సాయపడడు సరికదా, డబ్బును మంచి నీళ్ళలా ఖర్చు పెడుతూ అందిన చోటల్లా అప్పులు చేశాడు.

అతడు చేసిన అప్పులు నూరు వరహాలు దాటగా, ఒక రోజున అప్పులవాళ్ళందరూ ధర్మదాసు ఇంటికొచ్చి, వీరదాసును నిల దీశారు! ఏంచేయాలో తోచక తండ్రి ధర్మదాసు చింతాక్రాంతుడయ్యాడు. వీరదాసు అన్నలు, తమ్ముడి ఆగడాలకు మండిపడి, ''ఈ రోజు నుంచీ వీడికీ, ఇంటికీ ఏ సంబంధం లేదు. చేతనైతే వాణ్ణించి బాకీ వసూలు చేసుకోండి. లేదా వాణ్ణి న్యాయాధికారికి అప్పజెప్పండి,'' అనేశారు అప్పులవాళ్ళతో.

అప్పులవాళ్ళు ఇది విని కోపంగా, వీర దాసుతో, 'రెండు రోజుల్లో మా బాకీలు తీర్చు. లేకపోతే నిన్ను న్యాయాధికారికి అప్పగిస్తాం,'' అని హెచ్చరించి వెళ్ళిపోయారు.

అప్పుడు వీరదాసు, తండ్రీ, అన్నలతో, ''ఈసారికి నా అప్పులు తీర్చి, నన్ను కాపా డండి. ఇక మీదట కష్టపడి పనిచేసి, డబ్బు సంపాదించి, మీ బాకీ తీరుస్తాను,'' అన్నాడు.

''ఐతే, తక్షణం నువ్వు ఇల్లొదిలి వెళ్ళి సంపాదన మొదలు పెట్టు. నీ బాకీలు తీరే దాకా, నువ్వు తెచ్చిందానికి పది రెట్లిస్తాం,'' అన్నారు.

తండ్రి మెత్తబడతాడేమోనని, వీరదాసు ఆశగా ఆయన వంక చూశాడు. కానీ కొడుకు బాగుపడాలంటే వేరే మార్గం లేదని గ్రహిం చిన ధర్మదాసు కిమ్మనలేదు.

వీరదాసుకు పౌరుషమొచ్చి వెంటనే ఇల్లొ దిలి, సుగోపుడనే స్నేహితుణ్ణి కలుసుకుని, తనకొచ్చిన ఇబ్బంది చెప్పుకున్నాడు. సుగో పుడు ఒక్క క్షణం ఆలోచించి, ''ధనసంపాద నకు అన్నిటికన్న దొంగతనం సులభ మార్గం.

శ్రీరామ కమల్

ఈ ఊరికల్లా ధనవంతుడైన రమాకాంతుడి ఇంటి అనుపాలాలన్నీ, నాకు తెలుసు. ఎటొచ్చీ కాపలావాడి కళ్ళుపడకుండా ఇంట్లో ప్రవేశించాలంటే, ప్రహరీ గోడ దూకాలి. నువ్వొస్తానంటే, ఈ రాత్రి మనమా ఇంట్లో దొంగతనానికి వెళదాం. అదృష్టం బాగుంటే, ఈ రాత్రికే నీ మొత్తం బాకీ తీరిపోయేటంత డబ్బు దొరకొచ్చు,'' అన్నాడు.

వీరదాసు తల అడ్డంగా వూపి, ''ఇప్పటికే మావాళ్ళు నన్ను చెడిపోయానని తిడుతున్నారు. ఇక మీదట కష్టపడి డబ్బు సంపాయిస్తాను. ఎక్కడైనా పని దొరుకుతుందేమో చెప్పు,'' అన్నాడు.

అందుకు సుగోపుడు నవ్వి, ''వంచిన నడుమెత్తకుండా పని చేసినా, రోజు కొక్క వరహా దొరకదు. కాబట్టి నా మాట విని ఈ రాత్రికి మన ఊరి గుడిలో బసచేయి. పూజారి పెట్టిన ప్రసాదం తిను. రోజూ జగన్నాథుడు చెపుతూండే పురాణం విను. ఓ రాత్రి వేళ నేనొస్తాను. ఇద్దరం కలిసి దొంగతనానికి వెళదాం. దొరికింది తెచ్చుకుందాం. నీకేమో ఇప్పటి అవసరం తీరుతుంది. నచ్చితే ఇంకా ఇంకా దొంగతనాలు చేయొచ్చు. నచ్చలేదూ, ఇక మీదట మానేయొచ్చు,'' అన్నాడు.

''మరి ఈ రోజే పట్టుబడితే?'' అన్నాడు వీరదాసు అనుమానంగా.

''పట్టుబడితే కారాగార వాసం తప్పదు. కానీ, అప్పులు తీర్చకపోతే, రెండు రోజుల తర్వాత, నీకెలాగూ కారాగారవాసం తప్పదు కదా! అదే, ఓ రెండ్రోజులు ముందనుకుంటే సరి. నేను నాలుగు దొంగతనాలు చేశాను.



ఒక్క సారీ పట్టు బడలేదు. కాబట్టి, బాగా ఆలోచించుకో,'' అని చెప్పి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు సుగోపుడు.

సుగోపుడి సలహా వీరదాసుకు నచ్చలేదు. ఇంతవరకూ అన్నీ తప్పులే చేశాను. ఇంక తప్పులు చేయకుండా పెద్దల్ని సంతోష పెట్టాలి, అనుకున్నాడు.

వీరదాసుకు చీకటి పడేసరికి వంటికి నీరసమొచ్చింది. అప్పుడు సుగోపుడి మాటలు గుర్తుకు రాగా, గుడికి వెళ్ళి పూజారి పెట్టిన ప్రసాదంతో కడుపు నింపుకుని, పురాణ కాలక్షేపం జరుగుతూంటే వినడానికి కూర్చున్నాడు.

పురాణం వినిపిస్తున్న ఆ ఊరి మహా పండితుడు జగన్నాథుడికి, వ్యాఖ్యానంలో తనకు తనే సాటి అని పేరు. ఆ రోజాయన గీతాసారం వివరిస్తూ, ''మనగొప్ప మనదన్న అహం కూడదు. మన తప్పు మనదని కృంగి



పోకూడదు. చేసేదీ చేయించేదీ, మనలోనే వున్న ఆ భగవంతుడే!'' అన్నాడు.

ఈ మాటలు వీరదాసుకు బాగా తలకెక్కి, అతడి ఆలోచన మారింది. ''దేవుడే, సుగో పుడి రూపంలో నన్ను దొంగతనానికి ప్రోత్స హించాడు. నేను దొంగతనం చేస్తే, ఆ తప్పు నాదికాదు; దేవుడిది. కాబట్టి ఈ రోజు, సుగో పుడితో దొంగతనానికి వెళతాను,'' అనుకు న్నాడు. ఒక రాత్రి వేళ సుగోపుడు వచ్చి, ఆల యంలో పడుకున్న వీరదాసును నిద్రలే పాడు. ఇద్దరూ కలిసి రమాకాంతుడింటికి వెళ్ళి, నెమ్మదిగా రమాకాంతుడి పడకగదిలో దూరారు. సుగోపుడు, నిద్రపోతున్న రమా కాంతుడి తల కింది దిండు నుంచి, ఒడుపుగా తాళాలు తీసి, ఇనప్పెట్టె తెరిచాడు.

ఆ పెట్టెనిండా కనబడ్డ రత్నమాణిక్యాలు పొదిగిన బంగారు నగలు, వరహాల మూటలు చూడగానే, వీరదాసుకు కళ్ళు చెదిరాయి. సుగోపుడు రెండు వరహాల మూటలు తీసుకు న్నాడు. వీరదాసు కూడా చప్పున రెండు వరహాల మూటలు తీసుకున్నాడు. ఆ సమ యంలో సుగోపుడికి తుమ్మొస్తే ఆపుకోలేక పోయాడు. ఆ శబ్దానికి ఉలిక్కి పడి లేచిన రమాకాంతుడు, వాళ్ళను చూసి, ''దొంగలు, దొంగలు,'' అంటూ పెద్దగా కేకలు పెట్టాడు.

ఆ కేకలకు ఇంట్లోవాళ్ళు, కాపలావాడు పరుగున వచ్చారు. మిత్రులిద్దరూ పట్టుబడి, అందరి చేతుల్లోనూ చావుదెబ్బలు తిన్నారు.

రమాకాంతుడు వాళ్ళను, గ్రామాధికారికి అప్పగించాలనుకోగా, సుగోపుడాయన కాళ్ళ మీద పడి, ''బుద్ధి గడ్డితిని ఈ పని చేశాం. ఈసారికి క్షమించండి. నలుగురికీ తెలిస్తే, మా పెద్దల పరువు పోతుంది,'' అన్నాడు.

వాళ్ళిద్దరూ ఆ ఊరి పెద్ద మనుషుల పిల్లలని తెలియడంతో, రమాకాంతుడు కాస్త మెత్తబడి, ''అయినింట పుట్టిన మీకిలాంటి నీచపుబుద్ధి ఎలా పుట్టింది?'' అని అడిగాడు.

సుగోపుడు తల వంచుకున్నాడు. కానీ వీరదాసు ధైర్యంగా తన కథ చెప్పి, ''నా తప్పు తెలుసుకుని బుద్ధిగా వుందామనుకున్న వాణ్ణే. ఐతే, జగన్నాధ పండితుడి గీతాసారం వ్యాఖ్యానం విని, నేనేం చేసినా అది దేవుడి ఆదేశమే అని నమ్మి, దొంగతనానికి పూను కుని, ఇలా చావుదెబ్బలు తిన్నాను. తప్పు దేవుడిది కాబట్టి, శిక్ష కూడా ఆయనకే పడాలి; లేదా, తప్పు దేవుడిదన్న జగన్నాధుడికి పడాలి. కానీ నాకు పడింది. అందుకు జగన్నాధుడు సమాధానం చెప్పాలి,'' అన్నాడు.

రమాకాంతుడు తెల్లవారాక సుగోపుడు, వీరదాసు పెద్దలకూ, జగన్నాధుడికీ కబురు పెట్టి, విషయమంతా వివరించాడు.

అప్పుడు జగన్నాధుడు, ''గీతాసారంలోతైనది. దాన్ని సరిగ్గా అర్థంచేసుకుంటే, మేలు చేస్తుంది. మిడిమిడి జ్ఞానంతో తప్పుగా అర్థం చేసుకుంటే, ఫలితం వికటిస్తుంది,'' అన్నాడు.

''కానీ చేసేదీ చేయించేదీ, మనలోనే వున్న ఆ భగవంతుడేనని తమరనడం, అమాయకుల్ని తప్పుదారి పట్టించదంటారా?'' అన్నాడు రమాకాంతుడు.

జగన్నాధుడు నవ్వి, ''నేను దేవుడు మనలోనే వున్నాడంటే, వీరదాసు నమ్మాడు. సుగోపుడు దొంగతనం చేయమంటే, దేవుడే అలా చెప్పించాడనుకున్నాడు. దొంగతనం చేశాక, ఆ తప్పు దేవుడిదనుకున్నాడు. అంత వరకూ బాగానే వుంది. మరి మీరూ మీ ఇంట్లో వాళ్ళూ, చావుదెబ్బలు కొడితే, తను తిన్నాననుకోవడం మిడిమిడి జ్ఞానం కదా! నిజానికి అతణ్ణి కొట్టింది మీరు కాదు; మీ రూపంలోని దేవుడు. అంటే దేవుడు చేసిన తప్పుకు, దేవుడే శిక్ష అనుభవించాడు. ఐతే, దేవుడు మనలోనే వున్నాడు కాబట్టి, ఆయనకు శిక్ష పడినా, అనుభవించాల్సింది మనమే. నిన్న రాత్రి గుడిలో చెప్పిందానికి అర్థమదే. రాగద్వేషాల కారణంగా బంధాలలో చిక్కుకుని అనవసరమైన విషాదానికి లోనయ్యేవారికి కర్తవ్యం బోధించి, తమ విధిని నిర్వహించేలా చేసేది గీత. అందుకే దైవార్పణ బుద్ధితో తమ ధర్మాన్ని ఆచరించాలని చెబుతుంది. ఈ సందర్భాన్ని గాలికి వదిలి, నేరాలకుపాల్పడేవారు సైతం, దాన్ని తమకు అనుకూలంగా, అరకొరగా అన్వయించుకోవడానికి ప్రయత్నించడం వల్లే ఇలాంటి అనర్థాలు తలెత్తుతాయి. ఎవరైనా సరే, చేసిన పని ఫలితం అనుభవించక తప్పదు కదా!'' అన్నాడు.

వీరదాసు వెంటనే జగన్నాధుడి కాళ్ళ మీద పడి, క్షమించమని వేడుకున్నాడు. కొడుకులో మంచి మార్పు వచ్చిందని గ్రహించిన ధర్మదాసు, వీరదాసును ఇంటికి రమ్మని పిలిచి, అతడి అప్పులు తీర్చేశాడు.

ఆ తర్వాత వీరదాసే కాదు, సుగోపుడి వంటి అతడి స్నేహితులు కూడా ఋజువర్తనులై, హేమగిరికి మంచి పేరు తెచ్చారు.



# చందమామ కబుర్లు

## ఏనుగులకు రిఫ్లెక్టర్లు



మహానగరాలలో ట్రాఫిక్ పోలీసులు రాత్రుల్లో దూరం నుంచి సైతం కాంతిని ప్రతిఫలించే చేతి బ్యాండ్లనూ, తొడుగులనూ ధరిస్తూ ఉంటారు. కేరళ రాష్ట్రం ఆలత్తూర్‌కు చెందిన హరినారాయణన్, మహమ్మద్ రఫీ అనే ఇద్దరు మిత్రులు ఏనుగులకు రిఫ్లెక్టర్లు అమర్చిన తొడుగులను రూపొందించారు. రాత్రుల్లో ఒక చోటి నుంచి మరో చోటికి పయనించే ఏనుగుల రక్షణ కోసం వాళ్ళు దీనిని తయారు చేశారు. సెప్టెంబర్ 3వతేదీ తిరుచ్చూరులో జరిగిన ఏనుగుల 'మేళా'లో 139 ఏనుగులు పాల్గొన్నాయి. తమ 'నివాసాలకు' తిరిగి వెళ్ళినప్పుడు వాటన్నిటికీ రక్షణా 'కవచాలు' ఇవ్వబడ్డాయి.

## అంధులు కూడా ఇప్పుడు చదవగలరు



పాఠశాలలకు, కళాశాలలకు వెళ్ళే కంటిచూపు లేని విద్యార్థులు, సేవా భావంతో పనిచేసే 'రీడర్స్' సాయం తీసుకుంటారు. ఇటీవల చండీఘడ్‌లోని సెంట్రల్ సైంటిఫిక్ ఇన్‌స్ట్రుమెంట్స్ ఆర్గనైజేషన్‌కు చెందిన శాస్త్రవేత్తలు చేత్తో పట్టుకోవడానికి అనువుగా ఉన్న ఒక పరికరాన్ని రూపొందించారు. ఈ పరికరం 'చదివే కళ్ళలా' పనిచేస్తాయి. అందువల్ల పాఠ్యాంశాలను 'బ్రైలీ'కి మార్పిడి చేయవలసిన అవసరం లేకుండా చేస్తుంది. కంటి చూపు లేనివాళ్ళు సైతం ఇక మీదట అచ్చయిన వాటిని హాయిగా చదువుకోవచ్చు.

# చందమామ క్విజ్ - 12

Co-sponsored by
Infosys FOUNDATION,
Bangalore

అన్నీ సరైన సమాధానాలు
రాసిన ఒకరికి బహుమతి
రూ. 250లు.*

ఈ క్విజ్‌లో అడిగే ప్రశ్నలన్నీ 2006 జనవరి-డిసెంబర్ మధ్య వెలువడిన చందమామ సంచికలలోని కథలు, శీర్షికల నుంచే ఉంటాయి. చదివినవి జ్ఞాపకం ఉంటే వీటన్నిటికీ సమాధానాలు వెంటనే స్ఫురిస్తాయి. లేకుంటే పన్నెండు సంచికలను పక్కన పెట్టుకుని తిరగేస్తే ఇట్టే తెలిసిపోతాయి. కనుగొనడం కూడా చాలా సరదాగా ఉంటుంది.

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే బహుమతి మొత్తం డ్రా ద్వారా తీసిన ఐదుగురికి సమానంగా పంచబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే : 1. సమాధానాలు రాయండి. 2. మీ పేరు, వయసు (16 ఏళ్ళలోపు ఉండాలి), పిన్‌కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి. 3. ఒక కుటుంబంలో ఒకరు మాత్రమే పాల్గొనాలి. 4. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి. 5. కవరు మీద చందమామ క్విజ్- 12 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి. 6. జనవరి నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి. 7. మార్చ్ 2007 నెల సంచికలో ఫలితాలు వెలువడతాయి.

1. మన జాతీయ గేయం 'వందేమాతరం' రచయిత బంకించంద్ర చటర్జీ అని మనకందరికీ తెలుసు. మరి ఆయన దాన్ని ఏ సంవత్సరంలో రచించాడో తెలుసా?
2. జీవితం పూలబాటకాదు; నిరంతరపోరాటం. ఆత్మవిశ్వాసం, నిరంతర ప్రయత్నం ఉన్నప్పుడే మనిషికి భవిష్యత్తు బంగారం కాలగలదని నిరూపించిన రెండు జంతువుల కథ ఏది?
3. యువజన దినోత్సవంగా ఎవరి జన్మదినాన్ని జరుపుకుంటున్నాం? ఎప్పుడు?
4. ఎదుటివారి మంచితనాన్నీ, గొప్పతనాన్నీ గుర్తించాలంటే చూసే వారిలో సైతం అవి ఎంతో కొంత ఉన్నప్పుడే సాధ్యం అన్న సత్యాన్ని నిరూపించే కథ ఏది?
5. ఇంగిత జ్ఞానాన్ని కోల్పోయిన మితిమీరిన ఆగ్రహావేశాలే అన్ని అరిష్టాలకూ మూలం అన్న జీవిత సత్యాన్ని చాటే కథ ఏది? అది ఎందులోనిది?
6. ప్రపంచంలోనే అత్యధికమైన వయసుగల తాబేలు పేరేమిటి? వయసు ఎంత? ఎక్కడ ఉన్నది?

7. ఈ చిత్రం ఏ కథలో చోటుచేసుకున్నది? ఈ చిత్రంలోని పాత్రలు ఏవి?



మహనీయుల జీవితాల్లో ఆసక్తికర ఉదంతాలు (13)

# ఒదిగి ఉన్న అద్భుత యోగి!

ఘాజీపూర్‌లో పవహారీ బాబా అనే ఒక యోగి నివసిస్తూండేవాడు. ఆయన అద్భుతాలను ప్రదర్శించేవాడు గాని, ఆయన శక్తుల గురించి చాలా మందికి తెలియదు. అయితే, ఆయన కుటీరం చుట్టుపక్కల నివసించేవారికి ఆయన గొప్ప దయాగుణం కలవాడన్న విషయం బాగా తెలుసు. అంతవరకు ఆధ్యాత్మిక విషయాల పట్ల ఏమాత్రం ఆసక్తి లేని వారిలో సైతం, ఆయన ఆశీస్సులు దైవప్రేమను పురికొల్పేవి.

ఆ యోగి పట్ల స్వామి వివేకానంద (1863-1902)కు గొప్ప గౌరవభావం ఉండేది. స్వామి వివేకానంద ఘాజీపూర్‌లో ఉన్నప్పుడు ఆ యోగి కుటీరంలో జరిగిన ఒక ఉదంతం గురించి విన్నాడు: అర్ధరాత్రి సమయంలో ఒక దొంగ, యోగి కుటీరంలోకి జొరబడ్డాడు. మట్టి దీపం మసకవెలుగులో ఆశ్రమంలో ఏవైనా విలువైన వస్తువులు దొరుకుతాయేమో. అని వెతకసాగాడు. భక్తులు పళ్ళెంలో వేసిన కొన్ని నాణాలు, సత్తు పాత్రలు తప్ప కుటీరంలో మరేదీ కనిపించలేదు. వచ్చినందుకు అవైనా దొరికాయి చాలు అనుకున్నాడు దొంగ. పైగా, ఆ కుటీరంలో జొరబడడానికి వాడు పెద్దగా శ్రమపడింది కూడా ఏమీ లేదు. అసలు తలుపులు మూసి కూడా లేవు. నాణాలను, పాత్రలను దొంగ ఒక సంచీలో వేసుకుంటూండగా ఒక పాత్ర చేయి జారి దభీమంటూ కింద పడింది.

ఆ సమయంలో యోగి నిద్రిస్తున్నాడో, ధ్యానంలో ఉన్నాడో తెలియదుగాని, ఆ శబ్దం వినగానే, ''నారాయణా, ఏమిటా శబ్దం?'' అని అడిగాడు ప్రశాంతంగా.

అప్పటివరకు దొంగ, కుటీరంలో యోగి ఒక్కడు మాత్రమే ఉన్నాడని అనుకున్నాడు. ఇప్పుడు ఆయనతో పాటు నారాయణుడనే



మరో వ్యక్తి ఉన్నట్టు అనుమానించి ఉలిక్కి పడ్డాడు. ఈ నారాయణుడు యోగికి రక్షణ కల్పించే దృఢకాయుడేమోనని హడలిపోయాడు. దాంతో సంచీని అక్కడే వదిలి వెలుపలికి పరుగు పట్టాడు.

కొంత దూరం వెళ్ళాకవెనకఅడుగుల చప్పుడు వినిపించింది. నారాయణుడి అడుగుల చప్పుడేమో అని దొంగ మరింత వేగంగా పరిగెత్త సాగాడు. అయితే, మరి కొంత సేపటికి వాడి భుజాల్ని ఎవరో తాకినట్టయింది. దొంగ తల తిప్పి చూశాడు. ''నారాయణా, సంచీలో వేసుకున్న వాటిని అక్కడే వదిలి ఎందుకిలా పరుగెత్తుతున్నావు?'' అంటూ యోగి, సంచీని తీసుకోమని అతనికి అందించాడు. యోగి ప్రతి నరుడిలో నారాయణుణ్ణి, అంటే దేవుణ్ణి దర్శిస్తున్నట్టు దొంగకు అర్థమయింది. యోగికి వేటి పట్లా బంధం లేదు. అందువల్ల తన కుటీరంలోని వస్తువులను తీసుకోవడం ద్వారా దొంగ సంతోషంగా ఉంటే చాలనుకున్నాడు. పైగా, తనకు వాటి అవసరం కూడా లేదు.

దొంగ, యోగి పాదాలపైపడి నమస్కరించి, అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

కొన్ని సంవత్సరాలు గడిచాయి. స్వామి వివేకానందహిమాలయాలలో సంచరిస్తూండగా, తేజోమూర్తి, ప్రగాఢ ఆధ్యాత్మిక అనుభూతులు పొందిన ఒక సాధుపుంగవుడు ఆయనకు తారసపడ్డాడు. ఆ సాధువు వేరెవరో కాదు; పవహారీ బాబా కుటీరంలో దొంగిలించడానికి వెళ్ళిన ఆ దొంగే అని గ్రహించి అమితాశ్చర్యం చెందాడు. యోగి తనను స్పృశించి, నారాయణా అని పిలవడంతో దొంగకు పునర్జన్మ ఎత్తినట్టయింది. అంతవరకు పాపభూయిష్ఠంగా సాగిన వాడి జీవిత దశ, ఆ క్షణమే గతంలో కలిసిపోయింది. తనలో అలాంటి మహత్తరమైన మార్పును తీసుకువచ్చిన యోగి దివ్యశక్తికి అతడు అబ్బురపడ్డాడు. చిల్లర దొంగతనానికి వెళ్ళిన తనకు నిరుపమానమైన తరగని నిధి లభించినట్టయిందని ఎంతగానో సంబరపడ్డాడు.

స్వామి వివేకానంద పొందిన ఆశ్చర్యానందాలకు కూడా కొదువ లేదు. మన కళ్ళకు పాపాత్ములైన వారి పట్ల కూడా ఆ యోగి కరుణా కటాక్ష వీక్షణం దాగి ఉండేదని ఆయన గ్రహించాడు. -(ఎం.డి)

## చందమామ క్విజ్-10 సమాధానాలు

1. సి. మల్లికార్జున రెడ్డి; కర్ణాటక.
2. మరణభయం కలిగించడం. స్థూలకాయానికి చికిత్స.
3. మొగలు పాలకులు.
4. అక్టోబర్ 1.
5. బుద్ధుడి భార్య యశోధర.
6. కొండప్రాంతంలో నివసించేవారి మాతృభూమి.
7. రామనాట్టం.
8. మయూర ధ్వజుడు. స్వర్ణరేఖ ఆశాభంగం (బే.క)
9. లోయచివరి నిటారుబండ! (విదేశ పూర్వగాథలు-ఉత్తర అమెరికా, సియోక్స్ తెగ)

# నిజమైన స్నేహం

అచ్యుతాపురం గ్రామంలోని నారాయణ, రాంబాబు మంచి స్నేహితులు. నారాయణ తండ్రి భూషయ్య గొప్ప ఆస్తిపరుడు. కాని పరమ పిసినారి. నారాయణ సాటి మనుషులకు సాయపడే మనస్తత్వం కలవాడు. ముఖ్యంగా బాల్యంలో కొన్నాళ్ళు కలిసి చదువుకున్న రాంబాబు అంటే అతనికి ప్రాణం. తల్లిదండ్రులు లేని రాంబాబుకు ఇల్లు తప్ప మరేదీ లేదు. రెక్కాడితే గాని డొక్కాడని పరిస్థితి.

పట్నంలో పైచదువులు చదువుకుంటూన్న నారాయణ వేసవి సెలవుల్లో ఇంటికి వచ్చాడు. ఆ రోజు సాయంకాలం రాంబాబును చూడడానికి వెళ్ళాడు. రాంబాబు దుప్పటి కప్పుకుని పడుకుని మూలుగుతున్నాడు. నాలుగు రోజులుగా తీవ్రమైన జ్వరం. గ్రామంలోని వైద్యుడి దగ్గరికి వెళితే ఏవో మందులిచ్చాడు గాని, జ్వరం తగ్గలేదు. వైద్యం కోసం పక్కనే ఉన్న కృష్ణపట్నానికి వెళ్ళడానికి డబ్బుల్లేవు.



సంగతి తెలుసుకున్న నారాయణ ఇంటికి తిరిగివచ్చి, తండ్రికి విషయం చెప్పి, రాంబాబు వైద్యం కోసం డబ్బడిగాడు. ఆ మాట వినగానే భూషయ్య మండి పడి, "ఏమిటీ, నీ స్నేహితుడి వైద్యానికి డబ్బు కావాలా? ఇలా అందరికీ సాయం చేస్తూ పోతే, నాలుగు రోజుల్లో నేనూ వాళ్ళలా వీధినపడవలసిందే," అంటూ కొడుకును గట్టిగా మందలించాడు.

స్నేహితుడికి ఎలాగైనా వైద్యం చేయించాలన్న దృఢనిర్ణయంతో, నారాయణ వడ్డీ వ్యాపారి రంగనాథం వద్దకు వెళ్ళి, ఐదు వందల రూపాయలు అప్పు పుచ్చుకుని మిత్రుణ్ణి బాడుగ బండిలో కృష్ణపట్నానికి తీసుకు వెళ్ళాడు. వారం రోజుల్లో జ్వరం తగ్గి, రాంబాబు ఆరోగ్యం కుదుటపడింది.

పదో రోజు ఉదయం వడ్డీ వ్యాపారి నారాయణను వెతు

క్కుంటూ వచ్చి, "నారాయణ ఉన్నాడా?" అని అతని తండ్రి భూషయ్యను అడిగాడు.

"ఇంట్లో లేడు. అయినా, వాడితో నీకేంపని?" అని అడిగాడు భూషయ్య.

"వారంలో తిప్పి ఇస్తానని చెప్పి, మిత్రుడి వైద్యం కోసం ఐదు వందలు అప్పు చేశాడు. పది రోజులయింది. ఇంకా ఇవ్వలేదు," అన్నాడు వడ్డీ వ్యాపారి.



"అలాగా!" అంటూ ఆగ్రహంతో ఇంట్లో పలికివెళ్ళిన భూషయ్య, తన పరువు కాపాడుకోవడానికి ఐదు వందల రూపాయలు తెచ్చి వడ్డీవ్యాపారికిచ్చాడు. అతడు వెళ్ళిపోయాడు.

కొంతసేపటికి నారాయణ ఇంటికి రావడంతో, "ఏమిటి నీ నిర్వాకం! వడ్డీవ్యాపారి వద్ద అప్పు చేసి నా పరువు తీస్తావా?" అని నిలదీశాడు.

"నా మిత్రుడు ప్రాణాల మీదికి వస్తే, మరో మార్గం లేక అప్పు చేయవలసి వచ్చింది. ఇందులో పరువు ప్రసక్తి ఏముంది నాన్నా? డబ్బు, డబ్బు అంటూ నువ్వు సరైన సమయంలో వైద్యం చేయించక పోవడం వల్లే కదా అమ్మ కన్నుమూసింది. అయినా ఇంకా నీకు తెలిసి రావడం లేదు. అవసరాలకు పనికిరాని డబ్బు ఎందుకు? వెళ్ళేప్పుడు మూట గట్టుకు వెళతామా?" అన్నాడు నారాయణ బాధగా.

అంతలో అక్కడికి వచ్చిన రాంబాబు, "క్షమించండి, భూషయ్యగారూ. నా కారణంగా మీ మధ్య గొడవలు వద్దు. ఇదిగో వడ్డీ వ్యాపారికి మీరిచ్చిన ఐదు వందల రూపాయలు. వడ్డీ వ్యాపారి దారిలో ఎదురుపడి సంగతి చెప్పాడు. మా ఇంటి పత్రాలు ఆయన వద్ద తాకట్టు పెట్టి ఈ ఐదు వందలు తెచ్చాను. మరో యేడాది కష్టపడితే పత్రాలు విడిపించుకోగలను," అన్నాడు.

ఆ తరవాత నారాయణ కేసి తిరిగి, "సమయానికి వచ్చి ఆదుకుని నిజమైన స్నేహితుడనని నిరూపించావు. నీ రుణం తీర్చ లేనిది. నీ మేలు ఈ జన్మకు మరిచిపోను," అన్నాడు రాంబాబు అతడి చేతులు పట్టుకుంటూ.

ఇద్దరి మిత్రుల స్నేహబంధాన్ని చూసిన భూషయ్యలో కూడా మార్పు వచ్చింది. ఆ రోజు నుంచి పిసినారితనం వదులుకుని అవసరాల్లో ఉన్న వారికి సాయపడడం అలవరుచుకున్నాడు.

– బి.వి. నర్సింహారావు
విశాఖపట్నం – 530 020

## ఒరిస్సా జానపద కథ

# బంగారు చందమామ

ఓడలు సొంతంగా గల ఒక ధనిక వర్తకుడికి ఏడుగురు కొడుకులు, ఒక కూతురు ఉండే వారు. కొడుకులందరికీ పెళ్ళిళ్ళయిపోయాయి. తండ్రికి వర్తక వ్యాపారాల్లో కొడుకులు సాయ పడేవారు. వర్తకుడు, భార్య, కొడుకులు, కోడళ్ళు, కూతురితో సహా ఒకే ఇంట్లో సంతో షంగా నివసించేవారు. వర్తకుడి కూతురు తాపోయీ అందరికన్నా చిన్నది కావడంతో ఇంట్లోని ప్రతి ఒక్కరూ ఆమె పట్ల ప్రేమాను రాగాలు కనబరచేవారు. ముఖ్యంగా తండ్రి ఆమె కోరిన కోర్కెలు తీరుస్తూ, ఎంతో వాత్సల్యం కనబరచేవాడు.

ఒకనాడు తాపోయీ బొమ్మరిల్లు కట్టుకుని, మట్టి పిడతలతో వండుతూ ఆడుకుంటున్నది. అప్పుడు అటు కేసి వచ్చిన ఒక ముసలిది దాన్ని చూసి నవ్వుతూ, ''ఏం పాపా? నువ్వు కావాలంటే మీ నాన్న నీకు బంగారు చంద మామను తెచ్చి ఇవ్వగలడు కదా! ఈ మట్టి పిడతలతో ఆడుకుంటున్నావేంటి? సిగ్గుగా లేదా?'' అంటూ వెళ్ళిపోయింది.

అ మాట వినగానే తాపోయీ ఆటలాడ్డం మాని, బొమ్మలనూ పిడతలనూ అక్కడే వదిలి, ఇంట్లోపలికి వెళ్ళి మౌనంగా ఒక చోట కూర్చుని ముసలిది అన్న మాటల గురించి ఆలోచించ సాగింది: నేను మట్టి బొమ్మలతో ఆడుకుంటే తప్పేమిటి? నేను బంగారు చందమామనే అడి గాననుకుందాం. నాన్న తప్పక తెస్తాడు. దాంతో నేనేం చేసుకుంటాను? దాన్ని గురించి నా స్నేహితులతో గొప్పగా చెప్పుకుంటాను. వాళ్ళు దాన్ని చూసి సంతోషపడతారు. లేదా అసూయ పడతారు. అంతేకదా?

తాపోయీ విచారంగా ఉండడం చూసి ఇంట్లోని వదినెలు కారణం అడిగారు. అయినా తాపోయీ బదులేమీ చెప్పకుండా మౌనంగా లేచి వెళ్ళిపోయింది. అయితే, చిన్న వదినె నీలేంది ఆమె వెనకగా వెళ్ళి, ఆమెతో పాటు



నేలపై కూర్చుని, అమె చేతులను తన చేతు ల్లోకి తీసుకుని, "తాపోయీ, నాతో మాట్లా డవా? నీ సమస్య ఏమిటో నాతో చెప్పు. నేను దాన్ని పరిష్కరించడానికి మార్గం చెబుతాను," అన్నది ఆప్యాయంగా.

తాపోయీ మెల్లగా తలపైకెత్తి వదినె కేసి చూస్తూ, "నేను మట్టి బొమ్మలతో ఆడుకుం టూంటే ఒక ముసలవ్వ నన్ను ఎగతాళి చేసింది. నేను కావాలంటే మా నాన్న నాకు బంగారు చంద మామను తెచ్చివ్వగలడట. నిజంగానా బాబీ. నాకు అది ఒకటి కావాలి," అన్నది మెల్లగా.

"అదన్న మాట నీ సమస్య! నేనీ సంగతి మీ అమ్మకు చెబుతాను. ఆమె మీ నాన్నకు చెబుతుంది. తప్పకుండా ఆయన నీకు బంగారు చందమామ తేగలడు. విచారించకు. ఇప్పుడేమో నీ దగ్గరున్న బొమ్మలతో హాయిగా ఆడుకో," అంటూ నీలేంది ఆమెను గదినుంచి వెలుపలికి నడిపించింది.

వర్తకుడు మధ్యాహ్నం భోజనానికి వచ్చిన ప్పుడు ఆయన భార్య, తాపోయీ కోరికను మెల్లగా విన్నవించింది. వర్తకుడు చిన్నగా నవ్వి, "విశ్రాంతి తీసుకుంటున్నప్పుడు, తాపోయీని నావద్దకు పంపించు. ఎంత పెద్ద బంగారు చందమామ కావాలో అడిగి తెలుసుకుంటాను," అన్నాడు.

ఆ తరవాత ఆయన భోజనం ముగించి, పడుకోబోతూండగా, "నాన్నా, నన్ను పిలిచారా?" అంటూ తాపోయీ గదిలోకి అడుగు పెట్టింది.

"రా తల్లీ, రా. బంగారు చందమామ కావా లన్నావట కదా? ఎంత పెద్దది కావాలి? భోజనం పళ్ళెం అంత ఉంటే చాలా?" అంటూ వర్తకుడు కూతురిని ఆప్యాయంగా దగ్గరికి తీసుకున్నాడు.

తాపోయీ మరేమీ మాట్లాడకుండా చిన్నగా



నవ్వసాగింది. "నువ్వు దాంతో ఆడుకోవాలి. అంతే కదా! అది ఎంత పెద్దదిగా ఉండాలో నాకు తెలుసు. త్వరలోనే చేయిస్తాను. నువ్వు వెళ్ళి బువ్వ తిను. మంచి పాపవు కదూ," అంటూ తండ్రి కూతుర్ని ఆప్యాయంగా కౌగి లించుకుని ముద్దిచ్చాడు.

వర్తకుడు స్వర్ణకారుణ్ణి పిలిపించి బంగారు చందమామను తయారు చేయమని చెప్పాడు. అతడు వెంటనే ఆ పనికి పూనుకున్నాడు. అయితే, దురదృష్ట వశాత్తు, అది తయారు కావడానికి ముందే హఠాత్తుగా తీవ్ర అనారోగ్యా నికి గురైన వర్తకుడు మరణించాడు. అది తయారై, స్వర్ణకారుడు తీసుకువచ్చి ఇచ్చే సరికి తాపోయీ తల్లి కూడా చనిపోయింది. తాపోయీ విషాదానికి అంతులేకుండా పోయింది. తను బంగారు చందమామను కోరడం వల్లే, తన



తల్లిదండ్రులు తనకు దూరమయ్యారో ఏమోనని ఆమె బాధపడసాగింది.

కొన్నాళ్ళు గడిచాయి. వర్తకుడి కొడుకులు ఓడలో సరుకులు నింపి, వ్యాపారం కోసం దూరప్రాంతాలకు పయనమయ్యారు. బయలు దేరడానికి ఒక రోజు ముందు తమ భార్యలను పిలిచి, చెల్లెను జాగ్రత్తగా, ఆప్యాయంగా చూసు కోమని మరీ మరీ చెప్పారు. "ఆమె అనాధ అన్న సంగతి గుర్తుంచుకోండి," అన్నారు.

ఆ మాటకు భార్యలందరూ ముక్తకంఠంతో, "ఆమె అనాధ ఎలా అవుతుంది? ఆమె అవస రాలు తీరుస్తూ, ప్రేమగా చూసుకోవడానికి మేము ఉన్నాం కదా! ఆమె క్షేమం గురించి మీకు ఎలాంటి విచారమూ వద్దు. నిశ్చింతగా వెళ్ళి, వ్యాపారం చేసుకుని రండి," అన్నారు.

మరునాడు ఏడుగురు తోడుకోడళ్ళు, తాపోయీ, బంధుమిత్రులు సముద్రతీరం వరకు వెళ్ళి వర్తకుడి కుమారులకు పూల మాలలు వేసి, నుదుట తిలకం దిద్ది సాగనం పారు. ఓడ కనుచూపు దూరం దాటేంత వరకు అక్కడే నిలబడి, సజల నయనాలతో వెనుదిరి గారు. తాపోయీ చాలా సేపటి వరకు కన్నీళ్ళు ఆపుకోలేకపోయింది.

కొన్ని రోజుల వరకు వదినెలు ఆమెను చాలా ఆప్యాయంగా చూసుకున్నారు. తల్లితండ్రులు లేని లోపంగాని, అన్నయ్యలు ఇంటి పట్టున లేని కొరత గాని ఆమెకు కనిపించలేదు. అయితే, ఈ పరిస్థితి ఎంతో కాలం కొనసాగలేదు.

ఒకనాడు ఇంటి గుమ్మంలో ఎవరో బిక్షం అడగడం పెద్ద కోడలికి వినిపించింది. ఆమె అన్నం తీసుకుని గుమ్మంలోకి వచ్చే సరికి, "పిడికెడు మెతుకుల కోసం నేను ఎంత సేపని అరుస్తున్నాను తల్లీ? ఎవరూ నా మాట పట్టించు కున్నట్టు లేదే! ఇంట్లో అంతమంది ఉన్నారు కదా. ఏం చేస్తున్నారు మరి," అన్నది అక్కడ నిలబడ్డ ఒక ముసలిది నిష్ఠూరంగా.

"మా చిన్న ఆడపడుచు అవసరాలు సమ కూర్చడానికే మాకు సరిపోతోంది. అందుకే రావడానికి ఆలస్యమయింది," అన్నది పెద్ద కోడలు క్షమాపణలు చెబుతున్నట్టు.

"ఎవరూ, ఆ చిన్న పిల్లా? బావుంది. మీరం దరూ ఆ బుడతను సంతోష పరచడానికి ఇంత పాటు పడుతున్నారా? మీరెంత చేసినా, అన్న య్యలు రాగానే ఆ పిల్ల మీ మీద చాడీలు చెప్పదన్న నమ్మకం ఏమిటి? వృథాగా శ్రమపడ కుండా జాగ్రత్త పడండి," అంటూ కోడలిని మరింత దగ్గరికి పిలిచి, "నా మాట విని ఆ పిల్లను గొర్రెలు మేపడానికి అడవికి పంపండి. అక్కడ ఏ తోడేలుకో ఆహారమై పోతుంది. లేదా

పాము కాటుకు గుటుక్కుమంటుంది. పీడ విరగడై పోతుంది. మీ భర్తలు వస్తే, అనారోగ్యానికి గురై చచ్చిపోయిందని చెప్పవచ్చు,'' అని రహస్యంగా చెప్పి వెళ్ళింది.

ఆ ముసలిది వెళ్ళి పోయాక, పెద్ద కోడలు ఇంట్లోకి వెళ్ళి, మిగిలిన వాళ్ళతో ముసలిదాని మాటలు చెప్పింది. అందరూ ఆలోచనలో పడ్డారు. నీలేంది తప్ప తక్కిన వారందరూ ముసలిదాని మాటలను అమలు చేయడానికి సంసిద్ధులయ్యారు. అయినా, నీలేంది ఒంటరిగా వాళ్ళకు ఎదురాడలేకపోయింది. ఆ రోజు నుంచి తాపోయికి కష్టాలు ఆరంభమయ్యాయి. ఇంటి పనులన్నీ చేయవలసి వచ్చింది. ఏ పని చేసినా సరిగా లేదంటూ తప్పు పడుతూ తిట్టి పోయసాగారు. ఆఖరికి తాపోయీ తిండికి కూడా కరువయిపోయింది. ఆకలికి తట్టుకోలేక, ''మంగళాదేవీ, త్వరలో మా అన్నయ్యలను ఇంటికి రప్పించు,'' అని దీనంగా ప్రార్థించసాగింది.

ఒకనాటి ఉదయం పెద్ద కోడలు తాపోయీని పిలిచి, ''నువ్వు ఈ రోజు గొర్రెలను అడవికి తోలుకు వెళ్ళి మేపుకుని రా. ఇదిగో మధ్యాహ్నం ఆహారం,'' అంటూ చిన్న మూటను ఇచ్చింది.

తాపోయీకి కన్నీళ్ళు ఆగలేదు. ఎర్రని ఎండలో అడవికి ఎలా నడిచి వెళ్ళడం? అయినా తప్పదనుకుని గొర్రెల వెంట బయలు దేరింది. మధ్యాహ్న మయింది. ఆకలి వేయడంతో అన్నం మూటను విప్పింది. అందులో అన్నంతోపాటు రంపపు పొట్టు కలిసి పోయి వుంది. ముద్దన్నం కూడా తినలేక, అన్నం మూటను అలాగే చుట్టి పక్కన పడవేసింది. ఆకలితోనే సాయంకాలానికి ఇంటికి తిరిగి వచ్చింది. తరవాతి ఐదు రోజులు కూడా అలాగే



గడిచి పోయాయి. ఐదుగురు వదినెలూ అలాగే తినలేని విధంగా అన్నం మూట కట్టి ఇచ్చారు. అయితే, ఏడవ రోజు అన్నం కట్టి ఇచ్చిన కడగొట్టు వదిన నీలేంది మాత్రం రుచికరమైన భోజనాన్ని మూట కట్టి ఇచ్చింది. తాపోయీ హాయిగా తిని ఆకలి తీర్చుకున్నది.

ఇలాగే, రోజులూ, వారాలూ దొర్లి పోయాయి. నీలేంది వంట చేసే వారానికి ఒక్క రోజు తప్ప, తక్కిన ఆరు రోజులూ తాపోయీ ఆహారం లేక ఆకలితో అలమటించ వలసివచ్చేది.

ఒకనాడు సాయంకాలం గొర్రెల మందలో ఒక గొర్రె పిల్ల కనిపించలేదు. తాపోయీ దాన్ని పిలుస్తూ, దాని కోసం ఎక్కడెక్కడో వెతికింది. అయినా దాని జాడ కనిపించలేదు. ఆకాశంలో మబ్బులు కమ్ముకుని ఉరుములూ, మెరుపులతో వర్షం వచ్చేలా ఉండడంతో, మిగిలిన గొర్రెలను తోలుకుని తాపోయీ ఇల్లు చేరింది.

గొర్రెపిల్ల తప్పి పోయిందనడంతో, పెద్ద కోడలికి పట్టరాని కోపం వచ్చింది. మండు తూన్న కొరివి కట్టను తీసుకుని తాపోయిని కొట్ట బోయింది. హడలిపోయిన తాపోయి, ఏడుస్తూ ఇల్లు వదిలి అడవి కేసి పరిగెత్తింది. ఎటు చూసినా కారు చీకటి. ''తల్లీ, మంగళా దేవీ! నీవే నాకు దిక్కు. ఈ బాధలు ఇక భరించ లేను. మా అన్నయ్యలను త్వరగా రప్పించు,'' అంటూ దీనంగా విలపించ సాగింది.

అదృష్టవశాత్తు, అడవిని ఆనుకుని ఉన్న సముద్రంలో అదే సమయంలో తాపోయి అన్నలు ఏడుగురూ ఓడలో తిరిగి వస్తున్నారు. వారికి ఆడకూతురి దీనాలాపన వినిపించింది. గాఢాంధకారం అలముకున్న అపరాత్రి వేళ, అడవిలో రోదిస్తున్నది ఎవరా అని ఆశ్చర్య



పోయారు. ఇద్దరు అన్నదమ్ములు ఓడ నుంచి దిగి ఏడుపు వినిపిస్తూన్న దిశకేసి వెళ్ళారు. అక్కడ ఏడుస్తున్నది తమ చెల్లెలు అని గ్రహించి, ''తాపోయి ఇక్కడికెలా వచ్చావు తల్లీ?'' అని అడిగారు దిగ్భ్రాంతితో.

తాపోయి తన దయనీయ స్థితిని వివరించింది. వాళ్ళు ఆమెను ఓడలోకి తీసుకువెళ్ళారు. అక్కడున్న ఐదుగురు అన్నలు కూడా ఆమెను ఆప్యాయంగా అక్కున చేర్చుకున్నారు. నీలేంది తప్ప తక్కిన తమ భార్యలు తాపోయి పట్ల కర్కశంగా నడుచుకున్న తీరు గ్రహించి బాధపడ్డారు. వాళ్ళకు సరైన గుణపాఠం నేర్పాలని నిర్ణయించారు.

ఓడ వస్తూన్న వార్త అందగానే, మరునాడు తెల్లవారుతూండగా, ఏడుగురు తోడుకోడళ్ళూ భర్తలకు స్వాగతం చెప్పడానికి సముద్ర తీరానికి చేరారు. తాపోయి గురించి భర్తలకు ఏం చెప్పాలో పెద్ద కోడలు మిగతా వారికి మొదటే నేర్పింది. అయితే, పట్టు బట్టలతో ఒంటి నిండా నగలతో అన్నయ్యలతో పాటు తాపోయి ఓడ నుంచి వెలుపలికి రావడం చూసి దిగ్భ్రాంతి చెందారు. భర్తల కోపం చూసి ఒక్క మాట మాట్లాడలేక పోయారు. ఇల్లు చేరగానే, అన్నదమ్ములు తెచ్చిన కానుకలన్నిటినీ నీలేందికి ఇచ్చారు. తాపోయి పట్ల నిర్దయగా ప్రవర్తించినందుకు తక్కినవారిని కఠినంగా శిక్షించారు. ఆ తరవాత అన్నయ్యలు తాపోయిని యువరాణిలా చూసుకున్నారు.

దాదాపు ఐదు శతాబ్దాల క్రితం తాపోయి జీవించినట్టు చెప్పుకుంటారు. ఈనాడు కూడా ఒరియా అమ్మాయిలు మంగళాదేవి ఆశీస్సులు పొందడానికి ఒక్కపొద్దులుండి పూజలు జరుపుతూ 'తాపోయి పండుగ' జరుపుకుంటారు.

# అర్ధ కుంభమేళా

ఆరేళ్ళ క్రితం అంటే 2001 జనవరిలో ఉత్తరప్రదేశ్ అలహాబాదులో కోటి మంది ప్రజలు గుమిగూడిన మహాకుంభమేళా జరిగింది. ఇప్పుడు 2007 జనవరిలో ఇక్కడ అర్ధకుంభమేళా జరుగనున్నది.

పన్నెండేళ్ళ కోసారి వచ్చే మహాకుంభమేళా అలహాబాదు సమీపంలోని ప్రయాగలో, ఉత్తరాంచల్‌లోని హరిద్వార్‌లో, మధ్యప్రదేశ్‌లోని ఉజ్జయినిలో, మహారాష్ట్రలోని నాశిక్‌లో వరుసగా జరుపుకుంటారు. ఈ నాలుగు చోట్ల ఆరు సంవత్సరాలకోసారి అర్ధకుంభమేళాను జరుపుకుంటారు.

ఈ నాలుగు స్థలాలలో ఈ కుంభమేళాను జరుపుకోవడానికి గల కారణాన్ని తెలియజేసే ఆసక్తికరమైన ఒక కథ హిందూ పురాణాల్లో ఉంది: సృష్టి ప్రారంభదశలో శాపగ్రస్తులైన దేవతలు శాపవిముక్తికోసం బ్రహ్మను ప్రార్థించారు. పాలకడలిలోని అమృతకుంభాన్ని పొందడం ఒక్కటే మార్గమని బ్రహ్మదేవుడు చెప్పాడు. అది క్షీరసాగర మథనం వల్ల మాత్రమే సాధ్యం. అందుకు దేవతలు, రాక్షసుల సాయాన్ని కూడా కోరారు. మంథర పర్వతాన్ని కవ్వంగాను, వాసుకి సర్పాన్ని తాడుగానూ చేసి దేవాసురులు పాల సముద్రాన్ని మథించడం ప్రారంభించారు. అందులో నుంచి పలు అద్భుత వస్తువులు పైకి వచ్చాయి. ఆఖరికి అమృత కలశం (కుంభం)తో ధన్వంతరి పైకి వచ్చాడు. అమృత కుంభం కోసం దేవదానవుల మధ్య యుద్ధం ఆరంభమయింది. ఆకాశంలో జరిగిన భీకర యుద్ధ సమయంలో అమృత కుంభం నుంచి కొన్ని అమృత బిందువులు భూమి మీద పడ్డాయి. అమృత బిందువులు పడ్డ నాలుగు ప్రదేశాలు పవిత్రతను సంతరించుకుని పవిత్ర తీర్థ స్థలాలయ్యాయి.

ఈ సందర్భంగా శుభప్రదమైన పుణ్యకాలంలో అలహాబాదు సమీపంలో గంగాయమునల సంగమ ప్రదేశంలో స్నానం చేయడం సకల పాపహరమని భక్తులు విశ్వసిస్తారు. దీనినే 'ప్రయాగ స్నానం' అంటారు. పవిత్ర స్నానానికి చాలా శుభ ప్రదంగా పరిగణించబడే 'ప్రయాగ స్నాన్' జనవరి 19వ తేదీ జరుగనున్నది. ఈ సంవత్సరం జనవరి 8 నుంచి 20వ తేదీ వరకు పన్నెండు రోజుల పాటు ఈ 'అర్ధ కుంభమేళా' ఉత్సవం జరుగనున్నది.






# నిక్కచ్చి మనిషి

విష్ణుపురంలో వున్న శకారుడనే భాగ్యవంతుడికి కొన్ని నియమాలున్నాయి. ఆ ప్రకారం, ఆయన ఏరోజైనా, అడిగినవారికి వీలైనంతలో ధనసాయం చేస్తాడు; ఒక్క శుక్రవారం తప్ప. ప్రాణం మీదికొచ్చినా, తన కోసం అప్పు చెయ్యడు. నియమాలను పాటించడంలో ఖచ్చితంగా వుంటాడని, తెలిసినవాళ్ళాయన్ను నిక్కచ్చి మనిషి అంటారు.

ఆ ఊళ్ళోనే శకారుడి బాల్యస్నేహితుడు జోగిరాజు వుంటున్నాడు. ఒకప్పుడు బాగా బ్రతికిన ఆయనకు, కొంత కాలంగా అటు వ్యాపారంలోనూ, ఇటు వ్యవసాయంలోనూ ఏదీ కలిసిరాక వున్న ఇంటినీ, పొలాన్నీ తాకట్టు పెట్టాడు. పరిస్థితులిలాగే కొనసాగితే, ఓ ఏడాదిలో తన బ్రతుకు వీధిన పడుతుందని బెంగపెట్టుకున్నాడాయన. మిత్రుడు శకారుడి నడిగితే, అవసరానికి తన నాదుకుంటాడని, ఆయనకు తెలుసు. ఐతే, అభిమానధనుడైన జోగిరాజు, తన సమస్యకు శాశ్వత పరిష్కారం వెతకాలనుకున్నాడే తప్ప, ఎవర్నీ దేహీ అనే ఉద్దేశంలోలేడు.

అలాంటి సమయంలో ఆ ఊరుకు సుదర్శనుడనే త్రికాలవేది వచ్చి, ఆలయ ప్రాంగణంలో విడిది చేశాడు. ఊరివాళ్ళాయన్ను కలుసుకుని తమ ఇబ్బందులు చెప్పుకుంటే, సుదర్శనుడు దివ్యదృష్టితో భవిష్యత్తులోకి చూసి, వారికి తరుణోపాయం చెబుతున్నాడు.

జోగిరాజు కూడా ఆయనకు తన కష్టాలు చెప్పుకోగా, ''నువ్వు దేవుణ్ణి నమ్ముతావు. కానీ ఇంతవరకూ దైవకార్యాలకు ఒక్క దమ్మిడీ కూడా ఖర్చు చేయలేదు. అదే నీ కష్టాలకు కారణం. నమ్మకమున్న చోట వితరణ కూడా వుండాలి. నువ్వు ఓ శుక్రవారం నాడు, నూరు వరహాలు విలువ చేసే దేవుడి కంచుబొమ్మను డబ్బిచ్చి కొని, పూజామందిరంలో ప్రతిష్ఠించి పూజించు. మర్నాడా విగ్రహాన్ని ఎవరికైనా లాభానికి అమ్మగలిగితే, నీకు దశ తిరిగి పోతుంది,'' అన్నాడు సుదర్శనుడు.

జొన్నలగడ్డ రామలక్ష్మి

ఇది జోగిరాజుకు పక్కనేవున్న శకారుడికి నచ్చలేదు. ఆయన సాధువుతో, ''స్వామీ! పూజామందిరంలో వుండే కంచువిగ్రహాల ధరరెండు వరహాలకు మించదు. ఆ తర్వాత, అప్పటికే ఒకసారి అమ్ముడు పోయిన ఆ బొమ్మనింకా హెచ్చు ధరకు కొనే వాళ్ళుంటారా? కాబట్టి తమరు, నా మిత్రుడికి వేరే దైనా సులభ మార్గం ఉపదేశించమని కోరుతున్నాను,'' అన్నాడు.

సుదర్శనుడు నవ్వి, ''నాయనా! దైవ లీలలు విచిత్రాలు. ఈ విషయమై ఇన్ని సందేహాలు వెలిబుచ్చిన నీవే, నీ మిత్రుడికి అన్నింటా సాయపడతావేమో! ఎవరు చూడొచ్చారు?'' అన్నాడు.

అందుకు శకారుడు, ''నా మిత్రుడికి డబ్బు అప్పివ్వగలనేమో కానీ, చిన్న కంచు విగ్రహాన్ని నూరు వరహాలిచ్చి కొనే అవివేకాన్ని మాత్రం ప్రోత్సహించను,'' అన్నాడు.

ఆ మాటలు విని జోగిరాజు హతాశుడై, తనకు అదృష్ట యోగం లేదనే అనుకున్నాడు. తర్వాత సుదర్శనుడు, ఆ ఊరి నుంచి వెళ్ళిపోయాడు.

ఒకనాటి మిట్టమధ్యాహ్న సమయంలో ఎండ ఫెళ్ళున కాస్తూంటే, శకారుడు, ఆయన భార్య చారుమతి వేడి భరించలేక పెరట్లోకి వచ్చి, మామిడి చెట్టు నీడలో కూర్చున్నారు. అప్పుడెవరో కొత్తవాడు వస్తే, పనివాడు వెళ్ళి పెరటి తలుపు తీసి అతణ్ణి, యజమాని వద్దకు తీసుకువచ్చాడు. ఆ వచ్చినవాడు శకారుడికి నమస్కరించి, మంచి నీళ్ళు కావాలని సైగచేశాడు. చారుమతి చప్పున లోపలకు




వెళ్ళి, ఓ లోటాతో నీళ్ళు తెచ్చి ఇచ్చింది. అతడు గటగటా నీళ్ళు తాగి, శకారుడితో, ''నా పేరు మాల్యుడు. నా వృత్తి వ్యాపారం. ఒంటెద్దు బండిలో దేశమంతా తిరుగుతూ వివిధ ప్రాంతాల్లో లభించే విలక్షణమైన వస్తువులు కొని, ఒక ప్రాంతానివి మరో చోట అమ్ముతూంటాను. ఈ ఉదయమే ఈ ఊరొచ్చాను. సగం పైగా సరుకు అమ్ముడైంది. ఆ సంతోషంలో ఎండ ముదిరిందని చూసుకోలేదు. చెప్పలేనంత ఆకలిగావుంది. పూటకూళ్ళ ఇంటికి దారి చూపిస్తారా?'' అన్నాడు.

శకారుడు నవ్వి, ''ఆకలితో వచ్చిన వాళ్ళకు ఆతిథ్యమివ్వడం, మా సంప్రదాయం. నీకు పూటకూళ్ళ ఇల్లే కావాలనుకుంటే మాత్రం నేను దారి చూపను; వెళ్ళి ఇంకెవరినైనా అడుగు,'' అన్నాడు.




మాల్యుడాయన మంచి మనసు అర్థం చేసుకుని, అక్కడే భోంచేస్తానన్నాడు. చారుమతి క్షణాల మీద వంట పూర్తి చేసి, మాల్యుడికి విందుభోజనం వడ్డించింది. మాల్యుడు భోంచేస్తూండగా, పొరుగింటి పుల్లయ్య పిలిచాడని, అక్కడకు వెళ్ళాడు శకారుడు.

మాల్యుడు భోజనం ముగించి చారుమతికి, తన బండిలో వున్న వస్తువులు చూపాడు. వాటిలో వేణువునూదే కృష్ణుడి కంచు విగ్రహమొకటి, చారుమతిని ఆకర్షించింది. దాని ధర నూటపదివరహాలని తెలుసుకుని, ''ఇంత చిన్న కంచు బొమ్మల ధరరెండు వరహాలకు మించదు. ఈ బొమ్మకేమైనా ప్రత్యేకత వుందా?'' అన్నది ఆశ్చర్యంగా.

మాల్యుడు చిరునవ్వు నవ్వి, ''ఇది అక్బరు చక్రవర్తి కాలం నాటి విగ్రహం. మహా భక్తురాలు మీరాబాయి దీనికి కొంత కాలం పూజలు చేసి, ఓ భక్తుడికి దానం చేసిందంటారు! ఓ గృహస్థు దీన్ని నాకు తొంభై వరహాలకు అమ్మాడు. పదివరహాలు లాభమేసుకుని, నూరు వరహాలకు అమ్మాలనుకుంటున్నాను,'' అన్నాడు.

ఈ సమాధానానికి తృప్తి పడ్డ చారుమతి, ''ఈ బొమ్మ చూడ ముచ్చటగా వుంది. చేతిలో డబ్బుండాలి కానీ, మీరాబాయి పూజలందుకున్నందుకు, దీన్ని ఎంతయినా ఇచ్చి కొనొచ్చు,'' అంటూ అతడి మాటలను సమర్థించింది.

మాల్యుడు వెంటనే, ''అమ్మా! నేను చెప్పిన ధర ఇతరుల కోసం. నీకైతే ఈ బొమ్మను అమ్మలేను, కానుకగా ఇస్తాను,'' అన్నాడు.

చారుమతి ఏదో అనబోయేంతలో శకారుడు, పుల్లయ్యతో కలిసి అక్కడికి వచ్చాడు. సంగతి విని, సాధువు సుదర్శనుడు చెప్పినట్లే, నూరు వరహాల చిన్న కంచు బొమ్మ నిజంగానే తన ఇంటికి అమ్మకానికి వచ్చినందుకు ఆశ్చర్య పడుతూ, మాల్యుడికి, జోగిరాజు కథ చెప్పాడాయన.

బొమ్మను నూరు వరహాలకు అమ్మడానికి మాల్యుడు ఒప్పుకున్నాడు. శకారుడు వెంటనే జోగిరాజుకు కబురు పెట్టి రప్పించి, ''ఈ రోజు శుక్రవారం. సాధువు చెప్పిన బొమ్మ నిన్ను వెతుక్కుంటూ వచ్చింది. మారాలోచన లేకుండా వెంటనే కొనుక్కో,'' అన్నాడు.

జోగిరాజు దిగాలు పడి, ''ప్రస్తుతం నా దగ్గర ఒక్క వరహా కూడా లేదు. నా కోసం నువ్వింత శ్రమ తీసుకున్నావు. కానీ, దుర

దృష్టవంతుణ్ణి బాగు చేసేవారు లేరనిగదా సామెత!'' అన్నాడు.

''అలాగే, అదృష్టవంతుణ్ణి చెరిపేవారూ లేరని సామెత వుందిగా! నీకు పుట్టని అప్పు, నాకు పుడుతుంది! ఏం పుల్లయ్యా?'' అంటూ శకారుడు పక్కనే వున్న పుల్లయ్య వంక చూశాడు.

ఎప్పుడూ అడగని శకారుడు అప్పుడిగే సరికి కాదన లేక, ''రేపు నాకు అవసరం అయిన ఖర్చులున్నాయి. రేపటికి తిరిగి ఇచ్చే మాటైతే అలాగే ఇస్తాను,'' అన్నాడు పుల్లయ్య. శకారుడు సరేనన్నాడు.

ఆ విధంగా జోగిరాజు, మాల్యుడి దగ్గర నూరు వరహాలిచ్చి కంచుబొమ్మ కొని, సాధువు చెప్పినట్లే దాన్ని పూజామందిరంలో ప్రతిష్ఠించి పూజ చేశాడు. మర్నాడు శకారుడు జోగి రాజుకు నూటపది వరహాలిచ్చి కంచు బొమ్మను తీసుకుని, అతన్ని పుల్లయ్య బాకీ వంద వర హాలు తీర్చమని చెప్పి, బొమ్మను చారుమతి కిచ్చాడు.

ఆమె నిష్ఠూరంగా, ''చూశారా! నిక్కచ్చి మనిషనుకున్న మీకు, మాటనిలకడ లేదని తెలిసి పోయింది. ప్రాణం మీది కొచ్చినా అప్పుచేయననే మీరు, నిన్న పుల్లయ్యను అప్పడిగారు!'' అన్నది.

శకారుడు నవ్వి, ''నా అవసరానికి అప్పు చేయకూడదన్నదే, నా నియమం. నేను పుల్లయ్య దగ్గర చేసిన అప్పు జోగిరాజు కోసమే తప్ప, నా కోసం కాదు. ఈ వ్యవహారంలో నేను నా నియమాలన్నీ ఖచ్చితంగా పాటించానే తప్ప, నియమభంగం చెయ్యలేదు. కాదం టావా?'' అని అడిగాడు.

చారుమతి చిరునవ్వు నవ్వి, ''కాదని ఎలా అంటాను? స్వంతానికి అప్పు అడగరాదన్న నియమం కంటే కూడా, ఇతరుల కోసం అప్పడగవచ్చునన్న నియమం ఇంకా గొప్పది. సాధువు సుదర్శనుడు చెప్పాడని కాక, జోగి రాజుకు లభించిన డబ్బు, మీ వంటి ఉత్త ముడి డబ్బుకావడం వల్ల, అది అక్షయమై, అతడి దశను మార్చగలదని నమ్ముతున్నాను,'' అన్నది.

ఆమె అన్నట్లేఅనతి కాలంలో, జోగిరాజుకు దశ తిరిగి, ఆ ఊరి గొప్ప భాగ్యవంతుల్లో ఒకడయ్యాడు.





# కర్మ పరిపాకం

బుద్ధభగవానుడి కాలంలో అనాథపిండకుడనే వైశ్యోత్తముడుండేవాడు. ఆయనకు బుద్ధుడి యందు అపారమైన భక్తి. ఆయన జేతవ నంలో యాభైనాలుగు కోట్లు ఖర్చు చేసి గొప్ప ఆరామం కట్టించాడు. ఆయన విధిగా రోజుకు మూడు సార్లు బుద్ధభగవానుణ్ణి చూసి వచ్చే వాడు. ఎప్పుడైనా బుద్ధుడే తన అనుచరులతో సహా ఆయన ఇంటికి భిక్షకు రావటం కూడా జరుగుతూండేది.

ఈ అనాథపిండకుడికి ఏడంతస్థుల మేడ ఉన్నది. దానికి ఏడు ప్రాకారాలు. వాటిలో మధ్య ప్రాకారం మీద ఒక క్షుద్రదేవత తన సంతానంతో సహా నివాసం ఉంటూ ఉండేది. ఈ దేవతకు బుద్ధుడంటే బొత్తిగా పడదు. ఆయన తాను ఉండే ఇంటికి అప్పుడప్పుడూ వస్తూండటం ఆ దేవతకు ఎంతమాత్రం నచ్చ లేదు. ఆమె మానవ స్త్రీరూపం ధరించి అనా థపిండకుడి ఖజానాదారు వద్దకు వెళ్ళి, ''ఈ ఇంటికి బుద్ధుణ్ణి ఎందుకు రానిస్తారు? అటు వంటివాడు గడపలో అడుగు పెట్టడం ఇంటికి చెరుపు!'' అన్నది. ఖజానాదారు ఆమెను తిట్టి పంపాడు.

తరవాత ఆమె అనాథపిండకుడి కొడుకు దగ్గిరికి వెళ్ళి, అదే విధంగా మాట్లాడి, అతని చేత కూడా తిట్లు తిన్నది. చేసేదిలేక, అప్ప టికా క్షుద్రదేవత ఊరుకున్నది.

అనాథపిండకుడికి ఖర్చు నానాటికీ హెచ్చి పోయి, రాబడి తగ్గిపోతున్నది. ఆయన వ్యాపారం ఏమాత్రమూ చూడటం లేదు. ఇది కూడా గాక ఆయనకు ఇతరత్రా నష్టం కలిగింది. సాటి వ్యాపారస్థులు ఆయనవద్ద పద్ధెనిమిది కోట్ల సొమ్ము అప్పుగా పుచ్చుకు న్నారు. దానిని వాళ్ళు తిరిగి ఇవ్వలేదు, ఆయన అడగనూ లేదు. మరొక పద్ధెనిమిది కోట్ల ధనం బిందెలలో అచిరవతీ నదీ తీరాన పాతి పెట్టిస్తే, నదికి వరదలు వచ్చి ఒడ్లు కరిగి, ఆ బిందెలు కాస్తా సముద్రంలోకి కొట్టుకు పోయాయి.

వీటి ఫలితంగా అనాథపిండకుడు పేద వాడైపోయాడు. ఆయన భిక్షువులకింకా భోజ నాలు పెడుతూనే ఉన్నాడు గాని, వెనకటి విందులిప్పుడు లేవు.

ఒకనాడు బుద్ధభగవానుడు అనాథపిండకు డిని, ''ఇంకా దానాలు చేస్తూనే ఉన్నావా?'' అని అడిగాడు.

అనాథపిండకుడు ఎంతో ఆవేదనపడుతూ, ''స్వామీ, దానాలైతే చేస్తూనే ఉన్నాను గాని, నేనిప్పుడు దానం చేసేది గంజి మాత్రమే!'' అన్నాడు.

బుద్ధుడాయన బాధ గమనించి, ''విచారిం చకు, నాయనా! దానం చేసేవారి హృదయం మంచిదిగా ఉన్నంత కాలమూ, చేసే దానం గంజే అయినా కూడా అది తప్పకుండా మంచిదిగానే ఉంటుంది,'' అన్నాడు ఓదా ర్పుగా.

అనాథపిండకుడు పేదవాడైపోయాడు గనక ఇప్పుడు క్షుద్రదేవత ధైర్యంగా ఆయన వద్దకే వెళ్ళి, '''ఏమయ్యా, ఇంకా ఈ బుద్ధుణ్ణి ఎందుకు చేరనిస్తావు? హాయిగా నీ వ్యాపారం చూసుకో. పోయిన డబ్బంతా తిరిగి సంపా దించుకో. నేను మీయింటి నాలుగో ప్రాకారం మీద ఉండే దేవతను. నీ మంచి కోరి చెబుతు న్నాను,'' అన్నది.

అనాథపిండకుడు ఆమెతో, ''తక్షణం నా ఇల్లు వదిలి వెళ్ళిపో,'' అన్నాడు కోపంతో.

''పోక, నువ్వు చెప్పేవరకు ఇక్కడే కూర్చుం టాననుకున్నావా ఏమిటి? ఇంతకన్న మంచి ఇళ్ళే దొరుకుతాయి!'' అంటూ ఆ క్షుద్ర దేవత అప్పటికప్పుడే తన పిల్లల మూకను



వెంటబెట్టుకుని అనాథపిండకుడి ఇల్లు విడిచి వెళ్ళిపోయింది.

కాని ఆమె ఎంత వెతికినా అంత మంచి ఇల్లు మరొకటి దొరకలేదు. ఎక్కడెక్కడో వెదికి చూసింది. అయినా ప్రయోజనం లేక పోయింది. అటువంటి ఇల్లు వదిలినందుకు ఆమెకు పశ్చాత్తాపం కలిగింది. కాని విడిచి వచ్చిన ఇంటికి తిరిగి ఏ ముఖం పెట్టుకు పోవాలో తెలియక, ఆమె గ్రామదేవత సలహా కోసమై వెళ్ళింది.

''ఆ ఇల్లు విడిచి రావడం నీదే పొరపాటు. మళ్ళీ అక్కడికి వెళ్ళాలంటే ఒకపని చెయ్యి. అనాథపిండకుడికి వర్తకులు పద్దెనిమిది కోట్లు బాకీ ఉన్నారు. నువ్వు అతడి గుమాస్తా రూపంలో వర్తకుల వద్దకు వెళ్ళి ఆ పద్దెనిమిది కోట్లూ వసూలు చెయ్యి. అనాథపిండకుడి

ధనపు బిందెలు పద్దెనిమిది కోట్ల ధనంతో సహా సముద్రం చేరాయి. వాటిని తీసుకురా. ఫలాని చోట అనాథపిండకుడికి పద్దెనిమిది కోట్ల విలువ చేసే ఆస్తి ఉన్నది. ఈ సంగతి ఎవ్వరికీ తెలియదు. ఆ ఆస్తిని అనాథపిండకుడి పరం చెయ్యి, ఆ తరవాత ఆయన వద్దకు వెళ్ళి తొందరపడి ఇల్లు వదిలి వెళ్ళినందుకు క్షమాపణ చెప్పుకుని, తిరిగి రానిమ్మని అడుగు,'' అని గ్రామదేవత సలహా ఇచ్చింది.

క్షుద్రదేవత ఆ ప్రకారమే వ్యాపారులివ్వవలసిన పద్దెనిమిది కోట్లూ వసూలు చేసింది. సముద్రంలోని ధనపుబిందెలను తెచ్చింది. వాటితోబాటు పద్దెనిమిది కోట్లు విలువచేసే ఆస్తిని కూడా అనాథపిండకుడికిచ్చి, ''బాబూ, నాకు బుద్ధి వచ్చింది. నన్ను క్షమించి, మళ్ళీ మీ ఇంట ఉండ నివ్వండి,'' అని బతిమాలింది.

''ఈ క్షమాపణ బుద్ధభగవానుడి ఎదుట చెప్పుకో!'' అన్నాడు అనాథపిండకుడు క్షుద్రదేవతతో. ఆమె అనాథపిండకుడి వెంట జేతవనానికి వెళ్ళి, బుద్ధుడి ఎదుట జరిగినదంతా చెప్పుకుని క్షమాపణ వేడింది.

అంతా విని బుద్ధభగవానుడీ విధంగా అన్నాడు:

''దుష్కర్మ చేసేవాడు తన కర్మ పరిపక్వమయేదాకా తాను మంచి పనేచేస్తున్నాననుకుంటాడు. ఫలితం అనుభవించవలిసి వచ్చినప్పుడు గాని నిజం బోధపడదు. అదే విధంగా సత్కర్మ చేసేవాడు కూడా తన కర్మపరిపక్వం చెందే దాకా తాను చేస్తున్నది దుష్కర్మ అనే అనుకోవచ్చు. అతనికి కూడా ఫలం అనుభవించేటప్పుడే నిజం తెలిసివస్తుంది. మొదట చెప్పిన మాటకు ఈ క్షుద్రదేవతే నిదర్శనం. ఈమె తాను చాలామంచి పని చేస్తున్నాననుకున్నది. రెండవదానికి నిదర్శనం ఈ అనాథపిండకుడు. ఈయన తాను చెడ్డపని చేస్తున్నాననుకుంటూ ఎంతగానో విచారించాడు. కర్మపరిపాకం అయ్యాకనే, ఎవరిది సత్కర్మో ఎవరిది దుష్కర్మో బయటపడింది!''

ఈ మాటలు విన్న మీదట క్షుద్రదేవత తన బుద్ధి మార్చుకుని, బుద్ధుడియందు ద్వేషం విసర్జించి, గంపెడు పిల్లలతో సహా అనాథపిండకుడి ఇంటి నాలుగవ ప్రహరీ వద్ద యథాప్రకారం నివాసం చేయసాగింది.






# రామాయణం

గుహుడు భరతుడికి సహాయం చేస్తానన్నాడే గాని, లోలోపల అతన్ని సందేహం ఇంకా బాధిస్తూనే ఉన్నది. అతడు భరతుడితో, ''అయ్యా, నీ సేనా, అట్టహాసమూ చూస్తే నాకేదో అనుమానంగా ఉన్నది. నీవు వెళ్ళేది రాముడికి ద్రోహం తలపెట్టి కాదు గద?'' అని అడిగాడు.

ఈ మాటకు భరతుడు బాధపడి, ''నీకీ అనుమానం కలగటం కన్న పెద్ద కష్టం నాకేమి ఉంటుంది? పెద్ద అన్న అయిన రాముడు నాకు తండ్రితో సమానం కాదా? రాముణ్ణి తీసుకురావటానికే నేను పోతున్నాను. నా మాట నమ్ము,'' అన్నాడు.

''మంచిమాట అన్నావు, బాబూ. నీలాగా చేతికందిన రాజ్యాన్ని విడిచిపుచ్చే వాళ్ళు ప్రపంచంలో ఎక్కడా ఉండరు. నీ కీర్తి శాశ్వతం,'' అన్నాడు గుహుడు.

అస్తమయమై చీకటి పడింది. ఆ రాత్రి భరతశత్రుఘ్నులు పడుకుని నిద్రపట్టక చాలా సేపు రాముణ్ణి గురించి చాలా దుఃఖించారు. వారి వెంట ఉన్న గుహుడు వారిని ఓదార్చాడు. అతడు లక్ష్మణుణ్ణి గురించి గొప్పగా చెప్పాడు: ''రాముడు నిద్రపోతున్నప్పుడు తాను మేలుకునే ఉండి రాముడికి ఏ భయమూ లేకుండా కాపాడతాను, నిద్రపొమ్మని చెప్పాను. కాని విన్నాడుకాడు. రాముడూ, సీతా కటిక నేలపై పడుకున్నందుకే తన ప్రాణాలు కొట్టుకుపోతూ ఉంటే ఇక నిద్ర ఎలా పడుతుందని అడిగాడు. రాముణ్ణి వదిలి దశరథుడు ఒక్క రోజు బతుకుతాడా అన్నాడు. పధ్నాలుగేళ్ళు వనవాసం చేసి మేము మళ్ళీ అయోధ్యకు తిరిగిపోతామా అని చింతించాడు. అదుగో, ఆ మర్రిచెట్టు కిందనే రామలక్ష్మణులు జడలు ధరించారు.



తెల్లవారినాక నేను వారి చేత గంగ దాటిం చాను.''

గుహుడు ఈ విధంగా చెప్పుకుపోతూ ఉంటే భరతుడికి దుఃఖం హెచ్చిపోయింది. కన్నీటి ధారలను ఆపుకోలేక పోయాడు. కౌసల్యా, సుమిత్రా, కైకా కూడా అతనున్న చోటికి వచ్చారు. వారి ఆసక్తి చూసి గుహుడు వారితో రాముణ్ణి గురించి ప్రతి వివరమూ చెప్పాడు. సీతారాములు గారచెట్టు కింద పడుకున్న చోటుకూడా చూపాడు. దశరథ మహారాజు పెద్దకొడుకు ఆ చెట్టు కింద దర్భలు పరుచుకుని పడుకోవటం భరతుడు ఊహించనైనా లేకపోయాడు.

ఆ రాత్రి గడిచినాక గుహుడు సూర్యోదయమవుతూండగా వచ్చి భరతుడికి నమస్కారంచేసి, ''రాత్రి సుఖంగా గడిచిందా? హాయిగా నిద్రపోయారా?'' అని అడిగాడు.

''మాకు ఏలోటూ జరగలేదు. మేము త్వరగా మా అన్న రాముణ్ణి చూడాలి. మమ్మల్ని త్వరగా నది దాటించే ఏర్పాట్లు చేయించు,'' అన్నాడు భరతుడు.

గుహుడు అయిదువందల పడవలూ, స్వస్తికాలనే పేరు గల మేలుజాతి ఓడలూ సిద్ధం చేయించాడు. తెల్ల కంబళి పరిచిన ఒక స్వస్తికంలో భరతశత్రుఘ్నులూ, వసిష్ఠుడూ, రాజభార్యలూ ఎక్కారు. భరతుడి సేనా, రథాలూ, బళ్ళూ, వాటినిలాగే జంతువులూ, సంబారాలూ, సమస్తమూ పడవలలోకి ఎక్కించారు. పడవలు నది దాటాయి. ఏనుగులు నదికి అడ్డంగా ఈదాయి. అలాగే కొందరు మనుషులుకూడా ఈదారు. మరి కొందరు తెప్పలమీదా, కుండల సహాయంతోనూ నది దాటారు.

తరవాత భరతుడు ప్రయాగవనానికి సపరివారంగా చేరుకుని, వసిష్ఠాదుల సలహాతో భరద్వాజ మహర్షిని చూడ బయలుదేరాడు. భరద్వాజాశ్రమం కోసు దూరంలో ఉందనగానే సైన్యమంతా ఆగి పోయింది. భరతుడు తన ఆయుధాలూ, ఆభరణాలూ తీసివేసి, పట్టుబట్టలు కట్టుకుని, వసిష్ఠుణ్ణీ, మంత్రులనూ వెంటబెట్టుకుని ఆశ్రమానికి వెళ్ళాడు. మంత్రులు ఆశ్రమంలో నిలిచి పోయారు.

వసిష్ఠ భరతులు భరద్వాజుడి కుటీరానికి వెళ్ళారు. వారిని చూస్తూనే భరద్వాజుడు, ''అర్ఘ్యం తీసుకు రండి,'' అని కేక పెట్టి లేచి నిలబడ్డాడు. భరతుణ్ణి వసిష్ఠుడు పరిచయం చేసినాక భరద్వాజుడు క్షేమసమాచారాలడిగి,

''నాయనా, నీవు హాయిగా రాజ్యపాలన చేసు కోక ఇలా ఎందుకు వచ్చావు?'' అన్నాడు. భరతుడు రామలక్ష్మణులకు ద్రోహం తల పెట్టి వచ్చాడన్న అనుమానం ఆయనకుకూడా కలిగింది. భరతుడిందుకు మనసులో ఎంతో నొచ్చుకుని, గుహుడికి చెప్పినట్టే భరద్వాజు డితో కూడా తన ఉద్దేశం చెప్పాడు. అంతా విని భరద్వాజుడు సంతోషించి, ''సీతారామలక్ష్మ ణులు చిత్రకూటంలో ఉంటున్నారు. ఇవాళ ఇక్కడ ఉండి, రేపు పోదువుగాని,'' అన్నాడు. ఇందుకు భరతుడు సమ్మతించాడు. ''నీ సేనలకన్నిటికీ నేను విందు చేయాలను కుంటున్నాను. వారి నందరినీ దూరాన ఎందుకు ఉంచి వచ్చావు? ఇక్కడికి వారిని కూడా నీ వెంట తేవలిసింది,'' అన్నాడు భరద్వాజుడు.

''మహాత్మా, ముని ఆశ్రమాలకు సేనలు దూరంగా తొలగివెళ్ళాలన్న నియమాన్ని బట్టి సేనను దూరంగా ఉంచాను,'' అని భరతుడు సవినయంగా చెప్పాడు.

''ఫరవాలేదు, నీ సేనను పిలిపించు,'' అని భరతుడితో చెప్పి భరద్వాజుడు తన అతిథులకు అపూర్వమైన ఆతిథ్యం ఏర్పాటు చేశాడు. విశ్వకర్మ వచ్చి క్షణంలో అద్భుతమైన ఇళ్ళు ఏర్పాటుచేశాడు. నదులన్నీ వచ్చి నీరూ, మైరేయం అనే సుమధర పానీయం సిద్ధం చేశాయి. దిక్పాలకులు పిలిపించ బడ్డారు. పాటలు పాడటానికి విశ్వావసువూ, హాహా, హూహూ, అనే గంధర్వులూ, అనేక మంది అప్సరసలూ పిలిపించబడ్డారు. చంద్రుడు వచ్చి చతుర్విధాన్నాలూ పుష్ప



మాలలూ, పానీయాలూ, సుమధుర ఫలాలూ సిద్ధంచేశాడు.

మయుడు నిర్మించిన అద్భుతమైన భవ నాలలో ఒక రాజగృహంలాటిది భరతుడికి ప్రత్యేకించబడింది. అందులో సింహాసనంతో కూడిన విశాలమైన రాజసభ ఉన్నది. భర తుడు అక్కడి అందమైన సింహాసనం మీద కూచోక మంత్రుల ఆసనం పైన కూచుని, తన పరివారాన్నీ, గుహుణ్ణీ యథోచితస్థానాలలో కూచోబెట్టాడు.

బ్రహ్మదేవుడూ, కుబేరుడూ, దేవేంద్రుడూ తలా ఒక ఇరవైవేల మంది అప్సరసలను పంపారు. భరతుడు కొలువుతీరి ఉండగా నారద తుంబుర గోపులనే గంధర్వ రాజులు గానం చేశారు. అలంబుస, మిశ్రకేశి, పుండ రీక, వామన అనే అప్సరసలు భరతుడి ముందు నృత్యం చేశారు.

భరద్వాజాశ్రమంలో గల చెట్లూ, పొదలూ, లతలూ స్త్రీ రూపాలు ధరించి భరతుడి సైనికులకు భక్తి శ్రద్ధలతో చక్కటి అతిథి మర్యాదలు చేశాయి. సైనికులు రుచికరమైన భోజనాలు చేసి ఆనందించారు. వారిచ్చిన అతిథిసత్కారాలతో మైమరిచి, ''మేము అయోధ్యకూ పోము, దండకారణ్యానికిపోము, ఇక్కడే ఉంటాము. రాముడూ, భరతుడూ క్షేమంగా ఉంటారుగాక!'' అన్నారు. కొందరు పూల మాలలు ధరించి అటూ ఇటూ పరిగెత్తారు, పాటలు పాడారు, నృత్యాలుకూడా చేశారు. రకరకాల వంటకాలతో, పాయసంతో, మజ్జిగ పెరుగులతో దివ్యంగా తయారు చేసిన ఆహారాన్ని ఎంతతిన్నా వారికి తనివి తీరలేదు. ఆ రాత్రి అలా గడిచిపోయింది. మర్నాడు భరతుడు భరద్వాజుడి దర్శనం చేసుకుని, తమకు జరిగిన ఆతిథ్యానికి కృతజ్ఞత చెప్పుకుని, రాముణ్ణి చేరటానికి మార్గం అడిగాడు. చిత్రకూటానికి వెళ్ళటానికి దక్షిణంగా ఒక మార్గమూ, నైరృతీ దిశగా ఒక మార్గమూ ఉన్నాయనీ, సేనలు నడవటానికి ఏది యోగ్యమో చూసుకుని వెళ్ళమనీ భరద్వాజుడు సలహా ఇచ్చాడు.

దశరథుడి భార్యలు ముగ్గురూ మునికి మొక్కారు. భరతుడు తగిన రీతిగా వారిని మునికి పరిచయం చేశాడు. తన తల్లిని పరిచయం చేసేటప్పుడు అతను పరుషంగా మాట్లాడుతూ, కోపంతో దహించుకు పోయాడు. అది చూసి భరద్వాజుడు, ''రాముడు అడవికి వెళ్ళటం కైకేయి దోషం చేతనని ఒక్క నాటికీ



అనుకోకు. అందువల్ల ముందు ముందు చాలా లాభం కలుగుతుంది,'' అన్నాడు.

తరవాత భరతుడు భరద్వాజముని వద్ద యథోచితంగా సెలవు తీసుకుని తన బల గంతో చిత్రకూటానికి బయలుదేరాడు. వారు చివరకు మందాకినీ నదినీ, దానికి దక్షిణంగా ఉన్న చిత్రకూట పర్వతాన్నీ చేరవచ్చారు. రామలక్ష్మణులు ఎక్కడ ఉన్నదీ జాడ తెలుసుకు రమ్మని భరతుడు సైనికులను పంపాడు. కొందరు సైనికులు అడవి ప్రవేశించి ఒక చోట పొగ వస్తూండటం గమనించి ఆ సంగతి భరతుడితో చెప్పారు.

ఆ పొగవచ్చేచోట ఎవరో ఉన్నారు. అయితే వారు రామలక్ష్మణులు కావాలి. లేదా రామ లక్ష్మణుల జాడ ఎరిగిన మునులైనా కావాలి. భరతుడు సేనను నిశ్శబ్దంగా ఉండమని హెచ్చరించి, సుమంత్రుణ్ణీ, వసిష్ఠుణ్ణీ మాత్రమే వెంట తీసుకుని సైనికులు చెప్పిన దిక్కుగా బయలుదేరాడు.

రాముడు చిత్రకూటానికి వచ్చి అప్పటికి నెల అయింది. ఈ రోజే అతను తన పర్ణశాల విడిచి సీతతో సహా కొండ మీద విహరించ టానికి బయలుదేరాడు. చిత్రకూటపర్వతం చాలా అందమైనది. అక్కడి చెట్లూ, పక్షులూ, మృగాలూ, చిత్రవిచిత్రమైన ధాతువులూ, పక్కనే గలగలా ప్రవహించే మందాకినీ నదీ, మనోహరమైన దృశ్యాలూ చూస్తూ వారిద్దరూ చాలాసేపు విహరించారు. రాముడు సీతతో, ''నీవూ, లక్ష్మణుడూ నా వెంట ఉంటే ఈ దృశ్యాలు చూసి ఆనందిస్తూ ఎన్ని ఏళ్ళ యినా ఇక్కడే ఉండి పోగలను,'' అన్నాడు.



ఇలా చాలాసేపు విహరించిన పిమ్మట సీతారామలక్ష్మణులు ఒక చోట కూచున్నారు. రాముడు కులాసాగా కబుర్లు చెబుతూ సీత చేత సుమధుర ఫలాలు తినిపించాడు. అదే సమయంలో రాముడికి పరిగెత్తిపోతున్న అడవి ఏనుగులు కనిపించాయి. అవి చేసే అరుపులు వింటే భయపడి పరిగెత్తుతు న్నట్టు కనబడ్డాయి. నిజానికవి భరతుడి వెంట ఉండే సేనను చూసి బెదిరినవే. అప్పటికి రాముడు లక్ష్మణుడితో, ''చూడు, లక్ష్మణా! ఏనుగులూ, ఎనుబోతులూ, సింహాలూ కూడా బెదిరి పారిపోతున్నాయి. అటువైపు ఎవరైనా రాజు వేటాడుతున్నాడా? లేక ఈ అడవి మృగాలను మించిన క్రూర మృగ మేదైనా వచ్చిందా? కారణ మేమిటో చూడు!'' అన్నాడు. లక్ష్మణుడు ఎత్తయిన చెట్టెక్కి అన్ని దిక్కులా ఒకసారి కలయజూసే

సరికి ఉత్తర దిక్కుగా పెద్ద సేన కనబడింది. అతను రాముడితో, ''ఏదో పెద్ద సేన మనకేసి వస్తున్నది వెంటనే అగ్ని చల్లార్చి, సీతను గుహలో భద్రంగా దాచి, కవచం తొడిగి, ధనుర్బాణాలు తీసుకో,'' అన్నాడు.

''సరిగా పరిశీలించి చూడు, లక్ష్మణా! అలా వస్తున్నది ఎవరి సేనలాగుంది?'' అన్నాడు రాముడు.

లక్ష్మణుడు సేన మధ్య కనిపించే రథాలకు కట్టిన ధ్వజాలను గుర్తించి, ''భరతుడు తల్లి ధర్మమా అంటూ రాజ్యాభిషేకం చేసుకుని, అంతటితో తృప్తిచెందక తన రాజ్యం నిష్కంటకం చేసుకోవటానికై మనని చంపటానికి సేనలతో వస్తున్నాడు-మనం పర్వతం మీద దాక్కుందామా? లేక యుద్ధ సన్నద్ధులమై ఇక్కడే ఉందామా?'' అని రాముణ్ణి అడిగాడు కోపంగా.

అతను అంతటితో ఆగక, ''ఇప్పుడు భరతుడు మనకు చిక్కబోతున్నాడు. మనకీ కష్టాలన్నీ తెచ్చి పెట్టిన ఈ భరతుణ్ణి తప్పక చంపేస్తాను. అందులో తప్పేమీ లేదు. పైగా భరతుడు చస్తే నీవు హాయిగా రాజువు కావచ్చు. కైకేయినీ, ఆ మంథరనూ, వాళ్ళ వాళ్ళ నందరినీ కూడా చంపేస్తాను. అటువంటి పాపులు బతికి ఉండరాదు,'' అన్నాడు.

ఈ మాటలు విని రాముడు తన తమ్ముణ్ణి మెత్తగా చివాట్లు పెట్టాడు: ''తనకుతానై భరతుడు మనను చూడవస్తూంటే యుద్ధం చేస్తానంటావేమిటి? తండ్రి మాట నిలబెట్టటానికి ఇక్కడికి వచ్చినవాణ్ణి, భరతుణ్ణి చంపేసి లోకనిందకు పాలుకమ్మంటావా? కొంచెం నష్టం కలగగానే తండ్రినీ, తమ్ములనూ చంపుకుంటారా? భరతుణ్ణి ఎందుకు శంకిస్తున్నావు? అతను ఎన్నడైనా అనుమానించదగిన మాటలైనా నీతో అన్నాడా? అతను మామగారి ఇంటి నుంచి అయోధ్యకు వచ్చి, మనసంగతి విని మనని తిరిగి తీసుకుపోయే ఉద్దేశంతో వస్తూ ఉంటాడని నా నమ్మకం. నీకు నిజంగా రాజ్యకాంక్ష ఉంటే చెప్పు, భరతుడు రాగానే రాజ్యం నీకిమ్మంటాను. అతను నా మాట కాదనడు.''

ఈ మాటలకు లక్ష్మణుడు సిగ్గుపడితల వంచుకుని, ''మన తండ్రే మనని చూడటానికివస్తూఉండవచ్చు,'' అని మాట మార్చాడు.

రాముడు లక్ష్మణుణ్ణి చెట్టు దిగి రమ్మన్నాడు. లక్ష్మణుడు దిగి వచ్చాడు.





# ప్రశాంత జీవనం

పూర్వం ఒక గ్రామంలో గోవిందయ్య అనే ధనవంతుడుండేవాడు. ఆయన రకరకాల వ్యాపారాలు చేసి, ధనం ఆర్జించాడు. ఎన్నో ధర్మకార్యాలు చేశాడు. అయితే, ఆయనకు అరవై ఏళ్ళు వచ్చేసరికి తన వాళ్ళంటూ ఎవరూ లేకుండాపోయారు. ఆయన విరక్తి పుట్టి, తనకున్నదంతా గ్రామం బాగుకు ధార పోసి, ప్రశాంతంగా తన మిగిలిన జీవితం వెళ్ళబుచ్చటానికి వనాలకు వెళ్ళిపోయాడు.

సుదూరంలోని అరణ్య మధ్యంలో నీటి వనరులకు దగ్గిరలో ఒక అందమైన కుటీరం నిర్మించుకుని, కాయలూ, పళ్ళూ, కంద మూలాలూ తిని బతుకుతూ ఆయన ప్రశాంతంగా జీవించసాగాడు.

ఇంతలో ఒకనాడు ఒక వింత సంఘటన జరిగింది. గోవిందయ్య పొదలలో ఏవో కాయలు కోసుకుంటూండగా భయంకర మైన ఒక పెద్దపులి ఆయన వెనకగా, దాదాపు ఆయనను రాచుకుంటూ వెళ్ళిపోయింది. అంతకు ముందే దాని గాండ్రింపు విని భయ పడి పోయి చెట్టెక్కిన కట్టెలుకొట్టేవాడు దూరం నుంచి ఈ దృశ్యాన్ని చూశాడు. కాని గోవింద య్యకు మాత్రం తన వెనకగా పులి వెళ్ళిన సంగతి అసలు తెలియదు.

కట్టెలు కొట్టేవాడు గోవిందయ్య మామూలు మనిషి కాదని నిశ్చయించుకుని, గబగబా చెట్టు దిగివచ్చి, గోవిందయ్య కాళ్ళ మీద పడి, ''పెద్ద కుటుంబం గలవాణ్ణి. సంసారం ఈదలేక చస్తున్నాను. ఈ సంసార సాగరాన్ని తరించే మార్గం చెప్పండి, స్వామీ!'' అన్నాడు దీనంగా.

గోవిందయ్య వాణ్ణి లేవనెత్తి, ''నీ కష్టం నువ్వు చెయ్యి. కుటంబ పోషణకు కష్టపడక తప్పదు కదా. తరించటం మాట నీకెం దుకు?'' అన్నాడు.

ఆ కట్టెలు కొట్టేవాడు సమీపంలో ఉన్న తన గ్రామానికి వెళ్ళి, గోవిందయ్య గురించి ఎంతో అద్భుతంగా చెప్పాడు. అది మొదలు



జనం అరణ్యంలో కుటీరం నిర్మించుకుని ఉన్న గోవిందయ్య దర్శనం చేసుకుని పాపాలు పోగొట్టుకోవటానికి రాసాగారు. రాను రాను అది తీర్థప్రజ అయింది.

ప్రశాంతంగా జీవింతామనుకున్న గోవిందయ్యకు ప్రజల కష్టాలూ, సమస్యలూ, ఈతి బాధలూ వినక తప్పలేదు. వారు ఏకరువు పెట్టే సమస్యలకు తనకు తోచిన పరిష్కార మార్గాలుసూచించేవాడు. జనం అతన్ని గోవిందస్వామిని చేసి, దేవుడు లాగా పూజించసాగారు. క్రమ క్రమంగా అతని పేరు ఇంకా, ఇంకా దూర గ్రామాలకు పాకింది.

ఒకసారి బహు దూర గ్రామం నుంచి సుందరయ్యా, కాంతమ్మా అనే బీద రైతు దంపతులు కష్టాలు భరించలేక ఏదైనా పరిష్కారం లభించగలదన్న ఆశతో గోవిందస్వామి దర్శనం చేసుకోవాలని బయలుదేరారు.

వారు కొంతదూరం వెళ్ళేసరికి, యాత్రికుల వేషంలో పోతున్న కొందరు దొంగలు వారికి తగిలారు. సుందరయ్య అవతారమూ, బవిరి గడ్డమూ చూసి దొంగలకు ఒక ఆలోచన వచ్చింది. ఆకలితో అలమటిస్తున్న సుందరయ్యకూ, కాంతమ్మకూ వాళ్ళు తమ వద్ద ఉన్న తిండి పెట్టి, వాళ్ళకు తమ సంచీలలో నుంచి కాషాయవస్త్రాలు తీసి కట్టబెట్టారు. తరవాత తాము కూడా కాషాయవస్త్రాలు ధరించారు.

తరవాత దొంగలు ఆ అడవి ప్రాంతంలోనే ఒక చిన్న ఆశ్రమం నిర్మించి, సుందరయ్యను అందులో గోవిందస్వామి ప్రియ శిష్యుడిగా ప్రతిష్ఠించారు. అతను అభ్యంతరం చెబితే చంపేస్తామన్నారు. తాము అతని శిష్యుల లాగా నటిస్తూ, కొత్త స్వామి గురించి చుట్టుపక్కల గ్రామాలకు పోయి ప్రచారం చేశారు.

సుందరయ్య ఆశ్రమానికి గోవిందయ్య ఆశ్రమం చాలా దూరం. అందుచేత గోవిందస్వామి దర్శనం చేసుకునేటందుకు పోలేని వారు, ఈ చిన్న గోవిందస్వామిని చూడవచ్చారు. దొంగలు సుందరయ్యకు కొన్ని చిట్కాలు, ఇంద్రజాల విద్యలు నేర్పారు. అతను ఉత్త చేతులు రుద్దుకుని బూడిద తెప్పించేవాడు. నోట్లో నుంచి శివలింగాలు తీసేవాడు. ఈ గమ్మత్తులు చూసి భక్తులు పరవశించిపోయి, చిన్న గోవిందస్వామికి భక్తితో కానుకలు అర్పిస్తే, వాటిని దొంగలు తీసుకునేవారు. వాళ్ళకు ఈ రకం వృత్తి, దారిదోపిడీలకన్నా ఎంతో గిట్టుబాటుగానూ, చాలా గౌరవప్రదంగానూ ఉన్నది.

రాను రాను అసలు గోవిందస్వామి కన్న చిన్న గోవిందస్వామే గొప్ప గొప్ప మహిమలు గలవాడని వాడుకపడింది. అరణ్య మధ్యంలో మరీ దూరాన ఎక్కడో ఉన్న గోవిందయ్యకు భక్తులు తగ్గి, సమీపంలో ఉన్న సుందర య్యకు హెచ్చారు.

తన పేరు ఉపయోగించుకుని ఎవరో జనాన్ని మోసగిస్తున్నారని గోవిందయ్యకు అనుమానం కలిగింది. అది ఆయనకు తీరని ఆవేదన కలిగించింది. తాను ''స్వామి'' అయిన మాట నిజమేగాని, ఎవరినీ ఎన్నడూ ఏ విధంగానూ మోసం చెయ్యలేదు. ఈ కొత్త స్వామి ఎవరు?

అది తెలుకుందామని ఒకనాడు గోవిం దయ్య సుందరయ్య ఆశ్రమానికి బయలు దేరాడు. అతను ఎవరైనదీ తెలియని దొంగలు అతన్ని ఇతర భక్తులను ఆదరించినట్టే ఆదరించారు.

సుందరయ్య తన మహత్తులు ప్రదర్శించ గానే చూడవచ్చిన భక్తులు వెళ్ళిపోయారు. దొంగల అనుమతి మీద గోవిందయ్య సుందర య్యతో ఒంటరిగా కొంతసేపు మాట్లాడాడు. సుందరయ్య స్వామి హోదాలోనే అతని ప్రశ్న లకు జవాబు చెప్పాడు.

''తమ గురువుగారైన గోవిందస్వామి గారిని గురించి తెలుసుకోవాలని ఉన్నది. మీకు తెలిసినది చెప్పండి,'' అన్నాడు గోవిం దయ్య.

''నాయనా, వారిని గురించి నేను ఏమి చెప్పగలను? వారు గొప్ప తపస్సంపన్నులు!



దైవసాక్షాత్కారం పొందిన అపూర్వ జ్ఞానులు!'' అన్నాడు సుందరయ్య పరవశంగా కళ్ళు మూసుకుని.

''వారి పూర్వనామం ఏమై వుంటుందో తమకు తెలుసా?'' అని గోవిందయ్య మళ్ళీ అడిగాడు.

''పిచ్చివాడా! వారికి పూర్వనామం ఏమిటి? వారు పుట్టుతూండగానే అశరీరవాణి 'గోవింద స్వామి!' అని పలికింది,'' అన్నాడు సుంద రయ్య.

''ఆ స్వామి వారిని తమరు ఎంత కాలం క్రితం చూశారు?'' అని గోవిందయ్య అడి గాడు.

''నే నెప్పుడు తలుచుకుంటే అప్పుడు వారి దివ్యవిగ్రహం దర్శనమిస్తుంది!'' అన్నాడు సుందరయ్య.

''అలా అయితే నన్ను గుర్తుపట్టావా!'' అన్నాడు గోవిందయ్య.

''నువ్వు ఎవరు, నాయనా?'' అని సుంద రయ్య అడిగాడు.

''ఇప్పుడు మీరు కీర్తిసున్న గోవింద స్వామిని, స్వామీ!'' అన్నాడు గోవిందయ్య.

అది విని సుందరయ్య నిర్ఘాంత పోయాడు నోట మాట రాలేదు.

''ఇంద్రజాల విద్యలతో జనాన్ని ఎందుకు ఇలా మోసం చేస్తున్నావు?'' అని గోవిం దయ్య అడిగాడు.

దొంగలు తనను అడ్డం పెట్టుకుని జనాన్ని ఎలా మోసం చేస్తున్నదీ సుందరయ్య వివ రంగా చెప్పాడు. దొంగల నుంచి తప్పించు కుని పారిపోవటానికి తనకు. అభ్యంతరం లేదని కూడా అతను గోవిందయ్యకు స్పష్టం చేశాడు.

ఆ రాత్రి దొంగలు మత్తు నిద్రలో ఉన్న సమయంలో గోవిందయ్య సుందరయ్యనూ, అతని భార్యనూ తీసుకుని బయలుదేరాడు. వాళ్ళు చాలాదూరం ప్రయాణంచేసి, ఒక పట్టణం చేరుకుని, మామూలు పనులు చేసుకుంటూ బతక సాగారు.

నట్టడవిలో దొరకని మనశ్శాంతి గోవింద య్యకు జనసమ్మర్దంగల పట్టణంలో దొరి కింది. ఎందుకంటే అక్కడ అతన్ని ఎరిగిన వారూ, అతని సంగతి పట్టించుకునేవారూ లేరు.



చిత్రాలు: గాంధి అయ్య

12

# అజేయుడు గరుడుడు!

చంద్రాపురికి వచ్చిన ఆహ్వానితులందరూ వెళ్ళిపోయారు. తిరుగు ప్రయాణంలో వజ్రపురిరాజు విక్రమసింహుడూ, ప్రధాన మంత్రి పుష్పరాజూ కొండగుహలోని నరేంద్రదేవుణ్ణి కలుసుకున్నారు. చంద్రాపురిలో రాజగురువూ, ఆస్థాన జ్యోతిష్కుడూ పట్టాభిషేకం నూతన ముహూర్తం గురించి చర్చించారు.

రాజగురువు తనకు వచ్చిన కలను తలుచుకున్నాడు.

ఒక వింత ప్రాణి. అది ఏం చెబుతున్నదీ నేను అర్థం చేసుకోలేకపోయాను.

ఈ రోజు నేను పూజామందిరంలో భగవధ్యానంలో ఉండగా కొండ శిఖరాల వెనుకనుంచి ఏదో ప్రకాశం రావడం దర్శించాను.

ఒక దేవాలయాన్ని కూడా చూశాను. అందులో విష్ణు విగ్రహం ఉంది. లక్ష్మీదేవికీ, గరుడుడికీ చిన్న ఆలయాలు ఉన్నాయి. అయితే ఆ ప్రదేశమంతా శిథిలావస్థలో కనిపించింది....


కులదైవం ఆలయాన్ని నిర్లక్ష్యం చేస్తే కుటుంబానికి హాని వాటిల్లుతుందన్నది ఒక విశ్వాసం.
అలాగా?


రాజ్యానికి ఈశాన్య దిశగా ఉన్న ఆలయం భూకంపం కారణంగానూ, ఆ తరవాతి వెల్లువల కారణంగానూ బాగా శిథిలమై పోయింది. ఒకప్పుడు ఆ ఆలయం చుట్టూ ఒక నగరం ఉండేది.
ఇప్పుడు నేను వెళ్ళి, పట్టాభిషేకానికి నూతన ముహూర్తంతో తిరిగివస్తాను.


రాజగురువూ, జ్యోతిష్కుడూ వెళ్ళిపోయాక...
మహాప్రభూ! తమరు అనుమతిస్తే నేను ఈశాన్య ప్రాంతానికి వెళ్ళి. ఆలయాన్ని కనుగొని...
అంతవరకు ఆగలేరా ప్రభూ?


మహారాజు సంతోషంగా కనిపించలేదు.
ఆదిత్యా, నువ్వు రాజభవనం నుంచి ఇప్పుడే బయలుదేరాలా?


ఆదిత్యా, చాలాకాలం క్రితం, వంశంలో కొందరు ఎదురు తిరగడం రాజ్య విభజనకు కారణమయింది. ఈశాన్య ప్రాంత పాలకులు చంద్రపురి పట్ల మైత్రీభావం కనబరచక పోవచ్చు.
వాళ్ళు ఎవరు ప్రభూ?


ఉదాహరణకు సూర్యనగర్ రాజు. మనం ఆ రాజును పట్టాభిషేకానికి ఆహ్వానించాం. కాని ఆయన రాలేదు.
నేను అలాంటి రాజ్యాలలో అడుగుపెట్టను. మన సరిహద్దులోనే ఉంటాను.
అలా వెళితే, అది మరీ దూరమవుతుంది ఆదిత్యా. వజ్రపురి గుండా వెళ్ళావంటే త్వరగా చేరుకోవచ్చు. అయితే, నువ్వు ఎవరికీ తెలియకుండా వెళ్ళిరావాలి.


మారువేషంలో వెళ్ళడం భావ్యం కాదనుకుంటాను. అంగరక్షకులను వెంటబెట్టుకుని సురక్షిత మార్గంలోనే వెళ్ళివస్తాను.


ఎప్పుడు బయలుదేరాలనుకుంటున్నావు, ఆదిత్యా?


వజ్రపురి నుంచి ప్రత్యుత్తరం రాగానే బయలుదేరుతాను. నా ప్రయాణం జయప్రదం కావాలని ఆశీర్వదించండి ప్రభూ!
జాగ్రత్తగా వెళ్ళి, క్షేమంగా తిరిగిరా నాయనా!


రెండు రోజుల తరవాత...


మహాప్రభూ! వజ్రపురిరాజు, నరేంద్రదేవుణ్ణి కలుసుకోవడానికి కొండ గుహల వద్దే ఆగాడని నాకు వర్తమానం అందింది. ఆదిత్యుడు వెళ్ళే మార్గం కాపలాకు మన సైనికులను పంపాను.
వీరబాహూ! విక్రమసింహుడు మనతో స్నేహంగా ఉన్నాడా లేదా అన్న అనుమానం కలుగుతున్నది.


సరే, ఇప్పుడు అరుణ పరిస్థితి ఎలా ఉందో చూడడం అవసరం.
ఆమె స్థితిలో ఏదైనా మార్పు కనిపిస్తే తమకు వెంటనే తెలియబరుస్తాను, ప్రభూ!


వజ్రపురిలో...
మహాప్రభూ! ఈ లేఖ చంద్రపురి నుంచి వచ్చింది.
పుష్పరాజ్, దాన్ని తీసుకుని సందేశం ఏమిటో చదువు.


యువరాజు ఆదిత్యుడు వజ్రపురిగుండా వెళ్ళి, ఈశాన్య ప్రాంతాన్ని పర్యటించాలని ఆశిస్తున్నాడు.


హఠాత్తుగా ఈశాన్య ప్రాంతాన్ని పర్యటించవలసిన అవసరం ఏమిటి? ఎప్పుడొస్తున్నాడట?
రేపు ఇక్కడికి చేరుకుంటాడు. ఒక రోజు ఇక్కడ ఆగి ఆతిథ్యం స్వీకరించమని చెబుదామా?


అవును. సకల మర్యాదలూ చేయాలి. విందు కూడా ఏర్పాటు చేద్దాం.
సాదర స్వాగతం పలుకుతున్నట్టు ప్రతిసందేశం పంపుతాను.


మరునాడు ఆదిత్యుణ్ణి సగౌరవంగా విక్రమసింహుడి వద్దకు తీసుకువెళ్ళారు.


యువరాజు ఆదిత్యా, స్వాగతం! సుస్వాగతం! వజ్రపురి స్వాగతం పలుకుతోంది!
చాలా కృతజ్ఞతలు! మీరు చంద్రపురిని హఠాత్తుగా వదిలి రావలసి వచ్చింది చాలా దురదృష్టకరం.


నా బాల్యమిత్రుడు నరేంద్రదేవుణ్ణి చూడడానికి నాకది అవకాశం కల్పించింది. మీ రాజు చెప్పేంతవరకు అతడు ఘోరవిపత్తుకు లోనైన సంగతి నాకు తెలియదు.
అవును, అతడు మొసళ్ళ వాతబడి, తప్పించుకున్నాడని మాకు తెలియవచ్చింది.


అదృష్టం కొద్దీ బతికిపోయాడు. సరే, ఇప్పుడు నీ ఈశాన్య ప్రాంత పర్యటన ఉద్దేశం ఏమిటి?


అక్కడ భూకంపానికి గురైన ఒక విష్ణు ఆలయం ఉంది. నా పట్టాభిషేకం తరవాత దర్శించడానికి వీలుగా ఆ ఆలయాన్ని పునరుద్ధరించాలని మా మహారాజు ఆశిస్తున్నాడు.


అలాగా! చాలా మంచి ఆలోచన. రేపు సరిహద్దుల వరకు మా సైనికులు నీకు రక్షణగా రాగలరు.
చాలా కృతజ్ఞులు, మహారాజా!


పుష్పరాజు ఒక అంగరక్షకుణ్ణి పిలిచాడు.
యువరాజు ఆదిత్యుణ్ణి మన అతిథి గృహానికి తీసుకువెళ్ళండి.
చిత్తం, ప్రభూ!
-(ఇంకావుంది)

మన సాంస్కృతిక ఉత్సవాలు

# గాలిపటాల పండుగ



బంతి ఆట తరవాత పిల్లలు ముఖ్యంగా మగపిల్లలు ఎక్కువగా ఇష్టపడే ఆట గాలిపటాలు ఎగుర వేయడం. దీని పుట్టుక ఎక్కడో తెలియదు గాని, మొట్టమొదట హుయాన్ సాంగ్, హాన్ వంశ సేనలను భయ పెట్టడానికి గాలిపటాన్ని ఎగుర వేశాడని చెబుతారు. ఇది క్రీ.పూ. 200వ. సం.లో జరిగిందట. క్రీ. పూ. 100–క్రీ. శ. 500 మధ్యకాలంలో సంకేతా లను పంపడానికి గాలిపటాలను ఉపయోగించేవారు. క్రీ. శ 930 సం.రానికి సంబంధించిన జపాను సాహిత్యంలో షి (కాగితం) రోషి (పక్షి) ప్రస్తావన కనిపిస్తుంది. 1542 మంజన్ రచించిన మధుమతి అనే గ్రంథంలో 'పతంగ' అనే సంస్కృత పదం ఉంది. ఆకాశంలో ఎగరాలనే మనిషి కోరికే గాలిపటం రూపొందించడానికి దోహదం చేసిందని గుజరాత్ అహ్మదాబాద్‌లోని గాలిపటాల ప్రదర్శనశాల తెలియజేస్తోంది.

గుజరాత్ ప్రజలు గాలిపటానికి ప్రత్యేక ప్రాముఖ్యతనిస్తారు. జనవరిలో వచ్చే మకరసంక్రాంతి రోజున గాలిపటాల పండుగ జరుపుకుంటారు. మైదానాల నుంచి, ఇళ్ళ డాబాల పై నుంచి గాలిపటాలను ఎగురవేస్తారు. రాత్రి పూట వెలుతురు వెదజల్లే రంగు రంగుల గాలిపటాలను ఎగురవేయడం చీకటి ఆకాశాన్ని శోభాయమానం చేస్తుంది. ఆరు నెలల నిద్ర తరవాత ఆ రోజు దేవతలు మేల్కొంటారనీ, స్వర్గ ద్వారాలు తెరిచి ఉంటాయనీ అదే ఉత్సవం జరుపుకోవడానికి కారణం అనీ భక్తులు విశ్వసిస్తారు. గాలి పటాలు ఎగురవేయడం దేవతలకు కృతజ్ఞతలు తెలియజేయడంగానూ భావిస్తారు.

ఈ గాలిపటాల ఉత్సవాన్ని తిలకించడానికి దేశం నలుమూలల నుంచే కాకుండా చైనా, జపాన్ వంటి ఇతర దేశాల నుంచి కూడా పర్యాటకులు వస్తూ ఉంటారు. 1989వ సం.లో ప్రథమ అంత ర్జాతీయ గాలిపటాల ఉత్సవం నిర్వహించబడింది.

మకర సంక్రాంతి పండుగను దేశవ్యాప్తంగా, ముఖ్యంగా దక్షిణాదిన ఉత్సాహంగా జరుపు కుంటారు.

# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....




## విజ్ఞాన వీచికలు :

### ఆవిరికావడం – ఒక సహజ సంభవం

పాఠశాల చదువుల నాటి నుంచి మనం నీరు ఆవిరి అవుతూన్న విషయం గురించి తెలుసుకుంటూనే ఉన్నాం. సహజసిద్ధమైన ఈ సంభవం ద్వారానే వానలు కురుస్తున్నాయి. ఈ ప్రక్రియ ద్వారా సకల జీవరాశులకూ ఎలా మేలుకలుగుతున్నదీ తెలుసుకుంటే ఇంకా ఆశ్చర్యం కలుగుతుంది. కొత్త కుండలో కంటికి కనిపించని సూక్ష్మ రంధ్రాలు చాలా ఉంటాయి. మట్టిని ఎంత దట్టంగా పట్టించినా ఈ రంధ్రాలను మూయలేరు. కుండలో నీరు పోస్తే ఈ రంధ్రాలగుండా మెల్ల మెల్లగా నీరు వెలుపలికి వస్తూ ఉంటుంది. అలా వెలుపలికి వచ్చే సన్నటి నీటి బిందువులు కుండ లోపలి, నీటిలోని వెచ్చదనాన్ని పీల్చుకుని ఆవిరిగా మారుతాయి. ఇలా నిరంతరాయంగా కుండ నుంచి వేడి గ్రహించ బడడం వల్లే, కుండలోని నీరు చల్లగా మారుతుంది. వేసవి కాలంలో కుక్కలు నాలుకను వేలాడ దీసుకుని తిరగడం చూస్తూ ఉంటాం. ఇలా చేయడంవల్ల కుక్క నాలుక మీది లాలాజలం ఆవిరవుతుంది. దాంతో నాలుక చల్ల బడుతుంది. కుక్క కూడా చల్లదనాన్ని అనుభవిస్తుంది.

బాగా చెమటలు పోసినప్పుడు ఫ్యాన్ కింద నిలబడితే, చల్లగా ఉండడానికి కూడా ఫ్యాన్ గాలికి ఒంటి మీది చెమట ఆవిరి కావడమే కారణం.



## మన పరిసరాలు

### స్వర్గానికి సంబంధించిన చెట్టు

మనం అరటిని చెట్టుగానే తరచూ చెప్పుకుంటాం. దుంప మొదలు ఆకులూ, పువ్వులూ, కాయలూ, పళ్ళూ అన్నీ ఆహారంగా, ఔషధంగా ఉపయోగపడే అరటి చెట్టును 'కల్పవృక్షం'గా, స్వర్గానికి సంబంధించిన చెట్టుగా వర్ణించడం మన సంప్రదాయం. అయితే, వృక్ష శాస్త్రం దీనిని ఒక మొక్కగానే పరిగణిస్తోంది. దృఢమైన కాండం లేక పోవడం వల్ల దీనికి చెట్టు అనే అంతస్థు లభించడం లేదు. భూమికి అడుగున ఉన్న దుంపలాంటి దృఢమైన కాండం నుంచి ఇది మొలకెత్తుతుంది. అరటిలోని ప్రతి భాగమూ ఉపయోగపడుతుంది. పువ్వులు, కాయలు, పళ్ళు, దూట అన్నింటినీ తింటాం. ఇది మన దేశానికి చెందిన చెట్టే అయినప్పటికీ, ప్రపంచమంతా వ్యాపించి ఉన్నది.

ఫీనిషియన్ వ్యాపారులు అరటిని ప్రపంచానికి పరిచయం చేశారు. 1633వ సం.లో బ్రిటన్‌లో మొట్టమొదటి అరటి గెలను చూశారు.

# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....

## మీకు తెలుసా?



### ఈకలతో ఐసింగ్

పుట్టిన రోజు అనగానే అందరికీ ఆనందమే. ఉత్సాహమే. బర్త్‌డేపార్టీ అంటే పుట్టిన రోజు పండుగ అనగానే 'బర్త్‌డే కేక్' జ్ఞాపకం రాక తప్పదు. ఈ కేక్ ప్రత్యేకత ఏమిటంటే దాని మీది 'ఐసింగ్'. దీనితో పుట్టిన రోజు శుభాకాంక్షలూ, పేరూ అందంగా రాసి అలంకరిస్తారన్నమాట.

ఇవాళ రకరకాల 'ఐసింగ్' ఉన్నాయి. వాటికోసం రకరకాల పరికరాలు కూడా వచ్చాయి. అయితే, తొలిరోజుల్లో కేకులపై రాయడానికి అంటే 'ఐసింగ్'కు ఈకలను ఉపయోగించే వారు.

## మన దేశం క్విజ్



పురాతన భారతదేశం గురించిన విశేషాలను ఈనెల గుర్తు చేసుకుందాం:

1. బుద్ధుడు ఏ భాషలో బోధించాడు.
   ఎ. పాలీ బి. మాగధి సి. శూరసేని
2. కపిలుడు, గార్గి, మైత్రేయిలాంటి పండితులు, విదుషీమణులు ఏ నగరంలో నివసించేవారు?
   ఎ. మిథిల బి. పాటలీపుత్ర సి. విదీశ
3. దక్షిణ భారత దేశానికి చెందిన బ్రాహ్మణుడు ఆగ్నేయాసియాలో ఒక రాజవంశాన్ని స్థాపించాడు. ఆ దేశం ఈనాటి పేరేమిటి?
   ఎ. థాయ్‌ల్యాండ్ బి. లావోస్ సి. కంపూచియా

(సమాధానాలు 66వ పేజీలో)

## న్యూట్రిన్ కంటెస్ట్- 4




అట్ట చివర ఉన్న న్యూట్రిన్ ప్రకటనను జాగ్రత్తగా పరిశీలించి చూడండి.

"The Best ............... in Town" ఈ వాక్యాన్ని పూర్తి చేయండి. మీ సమాధానాన్ని ఒక కాగితం మీద రాసి, మీ పేరు, పుట్టిన తేది, తరగతి, పాఠశాల పేరు, పిన్‌కోడ్‌తో సహా ఇంటి పూర్తి చిరునామా రాసి, చందమామ ఇండియా లిమిటెడ్, 82, డిఫెన్స్‌ఆఫీసర్స్ కాలనీ, ఈకాట్టుతాంగల్, చెన్నయ్ -600 097 చిరునామాకు జనవరి 31వ తేదీలోగా పంపండి.

మీకోసం ఒక ఆకర్షణీయమైన బహుమతి★ కాచుకుని ఉంది.



# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



TATA NARAYANAMURTHY



K. RAMA KRISHNA RAO



వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు మార్చ్ 2007 సంచికలో ప్రచురిస్తాం.
ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.
ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ, ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600097.

## అభినందనలు

నవంబర్ నెల పోటీ
ఫలితాలు
జిత్యా హంసిని, కేరాఫ్ ఎ. ఎస్. మూర్తి
10-297/1, ప్లాట్ నం. 23
వసంతపురి కాలనీ
హైదరాబాద్ - 500 047
(ఆం.ప్ర)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫొటో : వినండి మాపాట!
రెండవ ఫోటో : జీవితం ఓ తోలుబొమ్మలాట!!

## సమాధానాలు :

1. బి) మాగధి
2. ఎ) విదేహ రాజధాని మిథిల (ఉత్తర బీహార్)
3. సి) కంపూచియా (ఆ దేశంలో కౌండిన్య గోత్రీకులు ఉన్నారు)

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097. Editor : B. Viswanatha Reddi (Viswam)

# ఇంధనం పొదుపు చేసే తెలివైన మార్గం



మోహన్ దిగ్భ్రాంతి చెందాడు. ఆ రాత్రి రద్దీగా ఉన్న రోడ్డు మీద వింత సంఘటన జరిగింది. ట్రాఫిక్ సిగ్నల్ వద్ద అతడు కారును ఆపాడు; అయితే ఎప్పటిలాగే ఇంజన్ను ఆఫ్ చేయలేదు. అప్పుడు ట్రాఫిక్ సిగ్నల్ స్తంభం రోబోలాగా అతని కేసి రావడం చూసి ఉలిక్కిపడ్డాడు. అది అతని వద్దకు వచ్చి ఆగి, ''హలో, నేనొక కథ చెబుతాను వింటావా?'' అని అడిగింది. ''చెప్పు మరి,'' అన్నాడు మోహన్ ఆసక్తిగా. సిగ్నల్ స్తంభం కథ చెప్పడం ప్రారంభించింది: ఒక ఇంటి యజమాని వారం రోజుల పాటు ఊరెళ్ళుతూ తోటమాలిని పిలిచి, ''మొక్కలకు రోజు తప్పకుండా నీళ్ళు పారించు. నీళ్ళ విషయంలో పిసినారితనం వద్దు,'' అని చెప్పి వెళ్ళాడు. మరునాటి ఉదయం నుంచే వర్షం ఆరంభమయింది. అయినా, తోటమాలి యజమాని మాటను పాటించాలనే ఉద్దేశంతో, జడివానలో సైతం మొక్కలకు నీరు పారించడం మానలేదు. దాని ఫలితంగా తోటలోని చాలా మొక్కలు చచ్చి ఊరుకున్నాయి. దాంతో పాటు పక్క తోటల్లోకి నీళ్ళు కట్టలు తెంచుకుని ప్రవహించాయి. స్తంభం ఈ కథ చెప్పి, ''ఆ తోటమాలి చర్యను గురించి నువ్వేం అనుకుంటున్నావు?'' అని అడిగింది. ''బుద్ధిలేని పని! వర్షం కురుస్తూంటే నీరు పారించడం మూర్ఖత్వం!'' అన్నాడు మోహన్.

''మరి ఇప్పుడు నువ్వు అలాంటి బుద్ధిలేని పనే చేయడం లేదా మోహన్? అవసరం లేనప్పుడు కూడా ఇంజన్ను ఎందుకు ఆన్ చేసి ఉంచావు? విలువైన పెట్రోలును వృథా చేస్తున్నావు కదా! దాంతో పాటు వాతావరణాన్ని కలుషితం చేస్తున్నావు కూడా. ఇక్కడ నా దగ్గర నిలబడ్డ వాహనాలు ఇంజన్లను ఆఫ్ చేయకుండా ఉంటే మొత్తం ఎంత పెట్రోలు నష్టం? మరెంత వాతావరణ కాలుష్యం! ట్రాఫిక్ సిగ్నల్ వద్ద 30 సెకనులకు పైగా ఆగవలసివస్తే ఇంజన్ను ఆఫ్ చేయాలి. విలువైన పెట్రోలును వృథా చేయడం, వాతావరణ కాలుష్యం సృష్టించడం మహానేరం,'' అన్నది సిగ్నల్ స్తంభం.

''అవును, అవును. ఆ సంగతి నేనెప్పుడూ ఆలోచించనేలేదు,'' అంటూ మోహన్ ఇంజన్ను ఆఫ్ చేశాడు. గ్రీన్ సిగ్నల్ పడేలోగా సిగ్నల్ స్తంభం తన యథాస్థానానికి తిరిగి వెళ్ళింది.

CHANDAMAMA (Telugu) Jan. 2007 RNI No. 1114/57. Regd No. TN/CC(S)Dn/159/06-08
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/06-08, Foreign No. 85/06-08